

గ్రంథకర్త.

పుల్లి రాజయ్య, మో॥ అంబారిపేట.

# నటీనటులు

## పురుషులు.

---

౧. సూత్రధారి
౨. దంభాసురుడు — అమరావతి అధిపతి
౩. సన్ముఖుడు — దంభాసురుని ప్రధాని
౪. నారదుడు — బ్రహ్మ పుత్రుడు
౫. విష్ణుమూర్తి — వైకుంఠనివాసుడు
౬. రామస్వామి
౭. లక్ష్మీకాంతం
౮. వెంకటేశం
౯. మహమ్మదు

(౬–౯) పాఠశాల బాలురు

౧౦. బైగీపాచారుడు — శంఖచూడుని విద్యాగురువు
౧౧. శంఖచూడుడు — కథానాయకుడు
౧౨. ముత్తిగాడు — ఎరుకువాడు
౧౩. బ్రహ్మ — సత్యలోక నివాసుడు
౧౪. శంఖచూడు ప్రధాని
౧౫. శుక్రాచార్యుడు — ధనుజుల కులగురుండు
౧౬. దేవేంద్రుడు — స్వర్గాధిపతి
౧౭. కుమారస్వామి — ఇంద్రుని మంత్రి
౧౮. శంకరుడు — కైలాసవాసుండు
౧౯. చిత్రరథుడు — శంకరుని దూత
౨౦. గుహుడు — పార్వతికుమారుడు

## స్త్రీలు

౨౧. నటీమణి
౨౨. లక్ష్మి — విష్ణుమూర్తి ఇల్లాలు
౨౩. సరస్వతి — బ్రహ్మ ఇల్లాలు
౨౪. ధవళాంగి — శంఖచూడుని తల్లి
౨౫. చెలికత్తె — ధవళదాసి
౨౬. తులసి — కథానాయకి
౨౭. సుగంధి — తులసీ చెలి
౨౮. ముత్తి — ఎరుకలసాని

శ్రీ ర స్తు.

శ్రీమతే రామానుజాయనమః

# సతీ తులసి పరిణయ నాటకము

## ప్రథమాశ్వాసము.

### ప్రారంభము.

కం॥ శ్రీరమణీమనోహర । నారదసంగీతలోల నగధరశౌరీ । భారమునీదని నమ్మితి । ధారుణి అంబారిప్యాట ధామముఃకుందా ॥

కం॥ దలచెద శ్రీగణనాథుని । దలచెద శివవిష్ణుబ్రహ్మ తమ్ముభృగుముఖ్యకం దుల్ । దలచెద మార్కండేయుని । దలచెద బావనబద్రావతులల్ యెప్రుడుల్ ॥

కం॥ భాంతి సలు యెల్లప్పుడు । మరువక నామదిలోదలతు మత్కవి కెపుడుల్ । నేకుపుత్రో సీయద్యల । సరగుణ నాకొసంగ జేసి సాకుమి జననీ॥

సీ॥ శ్రీరామలక్ష్మణుల సేవించి పూజించి । జనయిత్రిజనకుల సన్నుతింతు । ఆడెపు రామార్యుల అత్మయందున దలచి । చెన్నూరుగంగారాము సేవజేతు । కిష్టయాచార్యుల ఇష్టముగ పూజించి । ముల్లాను సాహెబ్బు ముందు గొలతు । ఘనపతివ్రతలను గొనియాడి మదిలోన । విష్ణుభక్తుల దలతు వరుసగాను ॥

గీ॥ పుణ్యపురుషులకును పదివేల వందనంబులొనరించి నేబహు ముదముతోయి । తులసీపరిణయ నాటకము యిలను మెచ్చ । రచన జేసెదా హరిదయా రసముపలన ॥

—(శ్రీకృష్ణుని ప్రార్థన - దరువు - ఏకతాళం)—

మురళీ మోగింపరా । గోపాలకృష్ణా । కరుణించిననూ గావరా ॥

గోపా॥ మురళీ మ్రోయించి మోమిటుజూపించి। కరిరాజావరదానా కాంతుదీర్పుము వేగ ॥ముర॥ తాపసనుత రావేరా । నాపైన నీకు । కోపమదేలనురా ॥నా॥ నాపాలిదేవుండు గోపాలుడేయని । యేప్రొద్దు సమ్మతి । కావాడు మొర్రెకేద ॥ముర॥ బుద్ధావతారుండవే । శ్రీ భుజగశయనా । భూరిపరాక్రముండవే ॥శ్రీ॥ యిద్దారితల్లూాల । ముద్దూాల శ్రీకృష్ణా । సుద్దులెంచక వా । వృద్ధిప్పుమని యంటి ॥ముర॥ వాసవాశ్చ్యుతుండనీ । వర

హావతార । ఆపించి వేడితినీ ॥వర॥ బాసురాంగా నీవీ । దాసు సేలకయున్న।
వాసీగనీతండ్రి వసుదేవునితోడై ॥మురః॥ దివరాత్రులూనిన్నికా । నా భావ
ములో నా । భక్తిమచే పూజించీతికా ॥నాభా॥ యేమిదైనా నాము । కవినేల
కున్నాను । ధవళాక్షునీ తల్లి । దేవదేవకితోడై ॥మురః॥ దశవేశుద్ధావీవనీ ।
ఆపించితినాదు దోషంబులెడబాపనీ ॥ఆక్షి॥ శేషశయనానన్ను । చేపట్ట
కున్నాను । కేశవనీ జననీ । యశోదదేవితోడై ॥మురః॥ కలలోననీ
రూపము । నేగసికాంక్షించీ । నాలోనమిమ్మతీ ఘనము ॥నేగ॥ యేలీలనైనా
నన్ । పాలించకా యున్న । జలజాక్షుమీయున్న । బలదేవునితోడే ॥మురః॥
నిత్యాస్వరూపుండవే । నిగమావిచారా । నీలాశరీరుండవే । నిగమావి
చారా । నీలాశరీరుండవే ॥నిగ॥ నిత్యానిత్యముఃనాకు । నీదర్శనమివకున్న ।
నీతమ్ముడైన యీ । సాత్యాకితోడై సుమ్మి ॥మురః॥ సాధురక్షణుడావనీ ।
పరనా విచారా । సన్నుతించినిన్ పూనీ ॥సర॥ మాధావనీమొక్క । బోధ।
ఏవ్వకయున్న । నీదుమేనత్తైన రాధాదేవీతోడై ॥మురః॥ భూభారమణ చితివె
శ్రీభూపతినాము । పాపంబు లెడబాపవే ॥శ్రీ॥ రభసమునానన్ను । రక్షింప
కాయున్న । విభవాక్షమీచెల్లె । సుభద్రదేవితోడై ॥మురః॥ నారదార్చి
తుండవే । శ్రీనతజనపాల । నయగుణశీలుండవే ॥శ్రీ॥ కారాణకర్తనా ।
నేరంబు లెంచీన । వరదనీప్రియపత్ని । శ్రీరుక్మిణీతోడై ॥మురః॥ చక్రాయు
ముండావనీ । చేపట్టితి నిను నా । సతినుతులబ్రోవుమనీ ॥చేప॥ అక్రూర
వదానా । ఆత్మనిల్పకయున్న । సక్రోధనీపత్ని । సత్యాభామతోడే ॥ము॥
అంబారిప్యాటావాస । రాజాఖ్యునికి సా । ఖ్యంబివ్వ శ్రీనివాస ॥రా॥ సంభ
రమున నన్ను । సవరించకాయున్న । శుంభప్రతాపనీదు । జాంభావతీ
తోడై ॥మురః॥

సం-వ॥ ఇట్లు ఇష్టదేవతా ప్రార్థనంబుంజేసి శ్రీశివపురాణంబునంగల సతీతులసి పరిణయ నాటక రూపంబుగా రచియించిన కథాక్రమంబెట్టిదనిన

—(సూత్రధారి ప్రవేశించి సభవంకజూచి)—

సూత్ర-వ॥ అహా సంతోషము సంతోషము యీ సభా మండలి బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రాది జనంబులు తమతమ పుత్రమిత్ర కళత్రాదులతో హరిచరిత్రంబులు వినంగోరి ఇట్టి సభ నలంకరించియున్న వారలు సకలిరికి కర్ణానందంబగునటుల నా కథ సత్కథ యొద్దిగలదో మన్నత్త్రా సర్వేరిముగ నటిని రావించి విచారించెదగాక.

—(వాదం - ఏక తాళం - తకుజు - వందవనీకిదిమే)—

సూత్రి॥ నారీమణి నటి రావే । సుకుమారీ సను గెకోవే ॥హానా॥ ఆరూఢిగ నామదికీ । నొకవిచారము దోచె నెకలకీ । స । త్వరమున రాగదె ఖుళకీ ॥హానారీమ॥

వ॥ ప్రియసీ నటినీమృదుమధురగానంబులతో నొకసారి నీవిటురమ్ము.

(అంతలోనటి ప్రవేశించి).

నటి-వ॥ నాథా మీకిదో అభివందనము.

సూ-వ॥ చెలి అష్టైశ్వర్యాభివృద్ధిరస్తు.

నటి॥ మారసదృషమనో నాథా ।మిము। జేరీతిసిదో గుణయూతా ॥వోమా॥ కోరికతో నన్నిటకూ । రా । బిలచినపని యెందులకు । నది । త్వరగను దెల్పవినుటకూ ॥వోమా॥

వ॥ నాథానన్నిచోట్టికి బహుతొందరగా బిలచిన కారణంబెట్టిదో స్పతపరచుడు మీయాజ్ఞరీతిగా మెలంగుదాన.

సూత్రి॥ సుఖంజాక్షి యిటు వినవే । నీ । వికన్ సభనుకనుగొనవే ॥వోసు॥ శ్రీకాంతుని కథలు వినీ । వి రేకాంతులమగుదుమనీ । యీసకల జనంబుల మదినీ ॥వోసు॥

వ॥ ప్రాణనాయకీ ఇట్టి సభవారందరు పుణ్యచరిత్రంబులు వినుటకై యపేక్షించి నీకొరకు నిరీక్షింపుచున్నవారలు కావున వీరికొక పుణ్యకథ యోచించి తెల్పెదవని నిన్నిందు రావించితిని యొక పుణ్యకథ యెద్దిగలదో తెల్పుము సఖి.

నటి॥ సుఖాంజాక్ష మీకేమీ ।నే। నికన్ దెల్పవలె స్వామీ ॥వోసు॥ సకల శాస్త్రములు మీరే । బహు । చదివినవారలు గారే ।నే। నికందెల్ప వలె వేరే ॥వోసు॥

వ॥ నాథా మీరు సకల శాస్త్రసంపన్నులైయుండియు యేమెరుంగని యీ అజ్ఞానురాలను విచారింపు చుంటిరా తమకుందెల్పని సత్కథలీ పృథివియందునగలవా మీరేయొక్క పుణ్యకథ నాలోచించి తెల్పుడు.

సూత్రి॥ అటులైనను యిటువినుమా ।నే॥ తటకున దెల్పెదగనుమా ॥నీవటు॥ బోటీమణి యింతలనూ । యా । మేటి తులసి చరితమును ।నది। తేటసుగను దెల్పుదునూ ॥నీవటు॥

గీ॥ తులసి పరిణయ నాటకము నేటిరాత్రి। బోటివినిపించవలెనని మనము నందు। గోరుచుంటెను గానసీ కోర్కెయేదో। తెల్పబల్కుము నేదెలుసు కుందునబలా॥

వ॥ సఖీమణీ శ్రీశివపురాణ యుద్ధకాండంబునంగల సతీతులసి పరిణయ నాటకము క్రొత్తగా రచియింప బడినది విన్నవించవలయునని నాకోరిక ఇందులకు నీయిష్టమెద్దియో వచింపుము.

నటి॥ మేటీ అంబారిప్యాట పురీ ।శ్రీ। హాటకాంభరునికోరి ॥యామే॥ నేటి రాత్రి యాతులసీ పరిణయ నాటకమును దయజేసె ।నది। సూటిగ దెల్పుడి గాసీ ॥యామేటీ॥

వ॥ ఔనౌను మనోహర యీతులసీ పరిణయ నాటకము వినుటకు మావంటిబోటి స్త్రీలకెంతో సంతోషము కావునయదే కథవిన్నవించుడి గానీ ఈనాటకమును క్రొత్తగా కృతిజేయించిన పుణ్యాత్ములెవ్వరో కృపజేసి వినంజేయుండని కోరుచున్నాదాన.

సూత్ర-వ॥ సరియంచిది అట్టులనే విన్నవించెద యిటువినుము.

సూత్ర-సీ॥ శ్రీకరమై యొప్పు జిల్లాకరీంనగ । తాలూక మెటుపల్లి ధర్మభూమి। పరగణకోరుపుట్ల పట్టణసమీప్యమునున్న। అంబారిప్యాట నీవాసులైన। శ్రీహరి భక్తుడగు చీటిజెగ్గారావు। దొరవారి సతిసౌభాగ్యవతియు। శ్రీమతీ సుశ్శీల దొరుసాని క్షితిలోన। యేదిశాశ్వితమనీ యెంచి మదిలో ॥గీ॥ కీర్తియే శాశ్వితమని యెంచి కేవలముగ। ఇట్టి నాటకము కృతిజేయింపజేసి। తగిన బహుమత్ యొసగి యీ ధరణియందు। కీర్తివహసిరా సతియటే కీరవాణీ॥

నటి-వ॥ యేమీ సుశ్శీల దొరుసాని జగత్ప్రసిద్ధి వహించుకొరకు ఇట్టి సతీతులసీ పరిణయ నాటకము రచన జేయించినదా సరి అట్టి పుణ్యాత్మురాలును యెల్లకాలము యాశ్రీహరి యేరక్షించును గానీ ఇట్టి నాటకమునకు యీ సుశ్శీల దొరసాని సోదర సోదరీ మణులుకొంత ద్రవ్య సహాయము జేసినరన వినియుంటిని కావున వారినామంబులు వినంగోరుచున్నదాన.

సూ-సీ॥ తరుణిరో వినగదే తాలూక జగిత్యాల । తత్సమీపమునున్న ధరధరూరు । గ్రామనీవాసులౌ ఘనుడును కొల్లూరి । లక్ష్మరావు

దొర రమ్యగుణుడు । వారిధర్మపత్ని వరరుక్మిణీమణి । ధరణి యందునకీర్తి వడసిరనగ । ఇట్టిదంపతులకు గట్టిసంతానంబు । నల్వురు యనదగు నవనిలోన । హనుమక్కదొరసాని నతిగుణమతి కియు । తమ్ముడు మాధవరావు ధర్మశాలి । సోదరి సుశీల దొరు సాని చెల్లెలు । నందమ్మ దొరుసాని సుందరాంగి ॥

గీ॥ వీరలందరు గూడి బహు వేడుకలర । రచనజేయుమని చెప్పి రతిముద మున । ఇట్టి సత్పుణ్యమతుల చేపట్టియెప్పుడు । శ్రీ రమేశుండు రక్షించు క్షితితలమునా ॥

నటి-వ॥ సరియీలాటి పుణ్యాత్ములను యీజగతిలో యా శ్రీహరి వీరి వంశ పరంపరములను దీర్ఘాయువుగా నుంచునుగాని కృతించినవారలెనరు.

సూ-గీ॥ పుల్లిరాజయ్య పంతుల్ను పరగబిలచి । కానుకలొసంగియు కవి పైన కాంక్ష జేయు । ధాత్రి సతితులసీ నాటకము చిత్రముగను । రచనజేసెను వినగదే । రాజవదనా ॥

వ॥ సఖిమణి వింటివా అంబారిప్యాట నివాసులగు ఆపస్తంభ సూత్రను కౌండిల ఋషిగోత్ర సంపన్నుండగు శ్రీపద్మశాలి పుల్లిరాజయ్య పంతులు రచించెను

నటి-వ॥ ఏమీ అంబారిప్యాట కవీశ్వరులగు పుల్లిరాజయ్య పంతులు రచించి నదా సరేకాని యతండిదువరకే నాటకమైన రచించెనా లేక ఇదియే క్రొత్తగా రచించెన.

సూ-గీ॥ భక్తనీల వర్ణో చరిత్రంబు బాగుగాను । రచనజేసినాడనవినీ రమణి యిపుడు। తెల్యనిస్త్రీవలె మరలనట్ల దెల్పుమనుచు। యడు గుటకు చిత్రమాయెనా మదికి నబలా॥

వ॥ సఖిమణి చౌటపల్లి అంబారిప్యాట స్వగ్రామ నివాసులగు శ్రీమాన్ హనుమంతరెడ్డి దొరవారు భక్తనీల వర్ణోపాఖ్యాన నాటకమునకు తగిన ద్రవ్యసహాయంబొనర్చి పుల్లిరాజయ్య పంతులుకు బహుమతి యొసంగి జగతియందు కీర్తిదెమ్మని నామాట నీవెరంగియే యుందువుగద అందులకు తెల్యని స్త్రీవలె మరల నన్నడుగుటమే చిత్రము.

నటి-వ॥ నాధా ఏనుమున్నే యెరంగియున్నదానను గాని ఇట్టి సభవారందరికి తెల్యునటుల మల్లి మీతో పలికించితిని ఇందులకు నాయం దేకాన తప్పు తప్పుగా తమకుందోచుచున్న క్షమించుడని నాప్రార్థన.

సూ—వ॥ సరి అట్లయిన సంతోషమే కాని నీవొకసారి వసంతకాలము వర్ణించి నామనంబానందింపజేయుము,

—(వాదం - ఆదితాళం.)—

నటి॥ మనోహరా యీ వసంబునంగల। వినోదముల యేమనందుగా ॥మనో॥
ఘనంబైన యీవసంత సుమములు। కనుంగొనగ ముదము నాయెగా॥

వ॥ నాథా ఈ వనవినోదవసంత సుమంబుల సువాసన లింతని చెప్పరాదు అహా ఎంత అందమైన గాలి వీచుచున్నదో చూడుము.

సూత్రి॥ మనోహరీ యీ వసంత సుమముల। భ్రమించి సిఖను ధరించుమా॥
మ॥ సనాతనమునుండి యిట్టి సుమములు। సఖీమణులకున్ ప్రేమ సుమా ॥మనో॥

వ॥ సఖీ మీవంటి బోటిమణుల కీసుమంబులపై చాలప్రేమ కావున నీ ప్రేమ దీరగా యీసుమంబుల నీశిఖలో ధరించి ఆనందింపుము.

నటి॥ చిలుకలు కోకిలములున్ బల్కగను। యులుకు జెందె నామనంబికా॥
చి॥ అలమ్మదు తుమ్మెద నాథంబులవిన। ఆనందంబును నాయెసభా॥

వ॥ ప్రియవల్లభా ఈ తుమ్మెదలు ఝుంఝుంమని మ్రోయగా చిల్కలు కోకిలంబులు ఎంత అందంబుగ నాట్యమాడుచున్నావో చూడుము అట్టి నాట్యంబులు కనుగొన్నంత మాత్రింబున నే యీమరుండు నాయు రమ్మున శరములదాల్చి నిలచెను కావున మరుతాప మాపుటకు నాతరంబు గాకయున్నదిగద నాథా.

సూత్రి॥ కలికిరో యీమల్లే పొదలలో మరు। కేళిగూడు దమ్మురమ్మ్మ
సఖి ॥కలి॥ సలలితముగ అంబారిప్యాట శ్రీ। శౌరిని స్మరియింపుచు ముళకీ॥

వ॥ ప్రియనాయకీ ఈ వసంత ఋతువులను గొనియాడి నామనంబు గూడ తల్లడిల్లజేసితివి సరి మనమీమల్లె పొదలిండ్లలో మనుసార మనోజ భోగంబులు సల్పుదము రమ్ము.

నటి—వ॥ చిత్తము అటులనే సల్పుదము పమ్ము.

సం—వ॥ (అని నిష్క్రమించిన పరుద వాత్రలును.)

వైకుంఠంబున లక్ష్మి తులసిపూజ చేయుట.

దరువు - ఏకతాళం - (చల్లని రాజా ఓచంద)

లక్ష్మి॥ తల్లీ తులసీ దయజూడవమ్మా । నా । యుల్లములో నిన్ను దలచెద నమ్మా । కొలచెదనమ్మా ॥తల్లీ॥ ఫుల్లాబ్జాక్షిరో నిన్నింక పూజించెదా । మల్లెపువ్వుల దండాలు మెడ నేసెదా । చల్లనీతల్లివే సతివి తులసివే । ఓ పల్లవపాణీనన్ పాలించవమ్మా । ప్రార్థింతునమ్మా॥ తల్లీ॥ బుకగులాల్ కుంకుమ మా త్తర్ పన్నీటితో । సుఖుమారీనిన్ పూజించితీ ప్రేమతో । సఖుదింజూపవె శాపమును తీర్పవె । ఓ శ్యామలాంగీ నిన్ను సేవింతునమ్మా । శరణంటినమ్మా ॥తల్లీ। పెంపైన అంబారిప్యాటంమున । విను ఇంపుతోజనులెల్ల మది యందున । సొంపుతో కార్తీక మాసంబునందిక । మీాధంపతులా పూజ జరిపింతురమ్మా । దయజూడవమ్మా ॥తల్లీ॥

సం-వ॥ (అంతలో సరస్వతిచ్చటికి విచ్చేసిన లక్ష్మినిగని)

లక్ష్మి-వ॥ శారదా వందనములు,

సర-వ॥ లక్ష్మి ప్రతి వందనముగా నీయొక్క విచారము,

లక్ష్మి-వ॥ భారతీ అది యెట్టి విచారమో వచింపుము.

వాదం- ఏకతాళం - (తరుజు నందనందనజూ)

సర॥ సుందరీ శ్రీలక్ష్మి నీవు చిన్నబోయియీా వృక్షమున్ ॥సుంద॥ ఎందుకును పూజింపుచున్నావో । ముందుగా దెల్పుమికన్ ॥సుందరీ॥

వ॥ లక్ష్మి సకల జనంబులు నిన్నే పూజింపుచుండగా నీవీ అన్య వృక్షమును బహు పెుపుజేయుచు పూజింపుచున్న కారణంబేమి.

లక్ష్మి॥ అన్యవృక్షముగాదు యిది బహు । పుణ్యవృక్షమే శారదా ॥అన్య॥ ధన్యుశాలీ ధాత్రి తులసీ । ధర్మధ్వజు పుత్రీగదా । అన్య॥

వ॥ సరస్వతీ ఇట్టి వృక్షము అన్యవృక్షమనుకొంటివా కాదుకాదు పతివ్రత స్త్రీలలో ప్రఖ్యాతి వహించిన సతీతులసి యనంబడును వింటివా.

సర॥ పతివ్రతలలో బోలినట్టి । పతితులసీ ఇతలా ॥పతి॥ ఖ్యాతిగా ఈ వృక్షమగుటకు । కారణంబదీ యేమిటా ॥పతి॥

వ॥ కావున నీవు దెల్పు వాక్యంబులు నాకాశ్చర్యంబై తోచు చున్నవి. అది యెటులన్నను నామె తులసీ వృక్షముగుట మేమి నీవు పూజింపు చున్న కారణమేమి.

లక్ష్మి॥ భారతీ యీ సతితులసీ శ్రీ। హరిని శిలగా జేసెనూ ॥భార॥ నేరముల క్షమియించుమని జో। హరులొనర్చితి యికవినూ ॥భార॥

వ॥ శారదా ఈమె శాపవశమ్మున నా నాథుండు శిలరూపము నొందెను అందు సుందరీమణిని పూజింపుచున్న దానను వింటివా.

సర॥ ఆహాహా శ్రీలక్ష్మి నామది। కాశ్చరియమై తోచెగా ॥ఆ॥ శ్రీహరియు శిలరూపమొందగ। విత్రిమాయెను బాగుగా ॥ఆహా॥

వ॥ లక్ష్మి యిదియేమి విపరీతము ఈనారీరత్నము తులసి వృక్షమై జన్మించిన హరి శిలరూపమొందుటకు కారణంబేమొ సవిస్తారమంత స్వష్టంబుగా విన్నవించుమని వేడుచున్నదాన.

లక్ష్మి॥ ధారుణీ అంబారిప్యాట। శౌరిచరితము ఇంతలక్ ॥ధారు॥ శారదా నే దెలిపెదానది। చక్కగానీ వినుమికక్ ॥ధారు॥

వ॥ సరె అట్టి సమాచారంబు దెలిపెద నీవిచ్చోట కూర్చుండుము.

సం-వ॥ అంతలొ సరస్వతి కూర్చుండివున్నంతలొ లక్ష్మి ఇట్టి కథను జెప్పుటకు ప్రారంభించిన పరుద వ్రాలుట.

## కథ ప్రారంభము.

-(ధంభాశూరుని ప్రవేశం - దర్బారూపకం - కంసాభూ)-

ధం॥ ధంభాశూరుడ శా శుంభప్రతాప। శూరగ్రేశ్వరుడనునే ॥ధం॥ గంభీరాస్వభావుడ। ఘనబలాఢ్యుడ ధైర్యుడ సంభరమున అమరావతి। చక్కగ పరిపాలించిన ॥ధం॥ సాధవలంధుననూ బహు చతురథా। జూపించిన వాడనునే ॥సాధ॥ వేదములాధి పురాణము వ్యాకరణము శాస్త్రంబులు। బోధలు నారూడిగనే జదివియు ధిగ్జయమొందిన ॥ధం॥ ధానవ వంశజుడా ధనదూనిమించు ధర్మాపరుడనునే ॥ధం॥ పని బూనియు అంబారీ। ప్యాట నివాసుని మననమున అనుదినమును దలచుచు యా। నందముతో చరియించిన ॥ధంభా॥

వ॥ షన్ముఖా.

షణ్ము-వ॥ రాజేంద్రా యేమి యాజ్ఞ

వాదం - ఏకతాళం (తరజు సచివోత్తమ మక్క)

ధం॥ షణ్ముఖ మన అమరావతి ధనుజులు । క్షేమముగ నే నేర్పగ జాల తెల్పుము ॥షన్ము॥ యేమికొంత లేక నిర్భయులై । కామితార్థములు గైకొని సిరతము ॥షన్ము॥

వ॥ షన్ముఖ మన అమరావతిలో ధనుజులకెల్ల క్షేమమే నా తెల్పుము.

షన్ము॥ ధానవేంద్ర మన అమరావతిలో ధనుజులకెల్లను సుఖమేసుమివిను॥ ధాన॥ అనుదినమును మీయాజ్ఞ చరింపుచు । ఘనముగ మిమ్మే గొనియాడుచు ఒల్ ॥ధాన॥

వ॥ ధంభాశూర ధానవేంద్ర మన అమరావతిలో సకల ధనుజులు సుఖోపాయులయ్యే యున్నవారు మహాప్రభో.

ధం॥ మంచిది యిటువిను నామదికిని నొక । కాంక్షగలిగె ఇంతలోన షన్ముఖ ॥మంచి॥ సంచితముగ మాకు పుణ్యపుత్ర । సంతతెన్నడు గల్గునో కద యిక ॥మంచి॥

గీ॥ వయసు ప్రాయము దీరగా వచ్చెగానీ । ఇంతవరకైనమాకును సంతతియును । గలుగదాయెమి ఇదియేమ కారణందో । పుత్రసంతతీలేనిమా పుటుక లేలా ॥

వ॥ ప్రధాని శేఖరా పుత్రులు లేని వారికి గతిమోక్షంబులు లేవని వేద శాస్త్ర పురాణంబులు దెల్పుచున్నవి కావున మాకింతవరకై నా పుత్రసంతతి గలుగదాయెను ఇక మావంతుకు పుత్రసంతతి యున్నదో లేదో కదా.

షన్ము॥ ధారుణి శ్రీ అంబారిప్రాట నిజ । ధాముడైన ఓంకశేశ్వరుడిల॥ ధారు॥ కోరుకున్న వరములు ధనుజులకును । కూరిమితోయిచ్చి బోచునమ్మమి ॥ధారు॥

వ॥ ధానవేంద్రా శంకరుని గురించి తాము తపమాచరించిన తప్పక మీకు సంతతి గల్గును ఇక నామాట అబద్ధమైన అదోత్రిలోకసంచారియగు నారదమహాఋషుల వారు ఇచ్చోటికి విచ్చేయుచున్నవారు యడిగి తెలుసుకొనుము.

ధం-వ॥ సరిమంచి దిటు రానిమ్ము.

నారదులు ప్రవేశం - (ఆదిమోహన రాగం)

నార॥ నారాయణ శౌరి నరహరి ॥నా॥ నారాయణ నీ నామమె మధురము । కారణరూప మురారిపరాత్పర ॥నారా॥ గోపరిపాలా గోపిక లోలా । తాపసనుత దయజూడవదేలా ॥నారా॥ నందకుమారా నవనీతచోరా । ఇందిరేశ ముకుంద జనార్ధన ॥నారా॥ సురవరరక్షా సురరిపుశిక్షా వరదాయక శ్రీ । వందిత చరణా ॥నారా॥ భాసురముగ అంబారిప్యాట నీ । వాసుదేవ హరి భక్తుల నేలిన ॥నారా॥

సం-వ॥ ఆహాహా శ్రీహరి శ్రీమన్నారాయణ నీలీలా నామామృతంబును పఠించిన నామది కెంతో మధురంబయ్యెను. ఇక నన్ను రక్షింపుము దేవా మహానుభావ (అని యోచించి) యేమీ ఈ సమయంబున ధంభాసురుండు పుత్రసంతానము కొరకై నాలోచింపుచున్నవాడె సరె ఇదియే సమయము మంచిగ దొరసివచ్చినది అలనాడు రాధాదేవి సుధాముని ధనుజుండవై జన్మించగలవని శాపంబొసంగెను కావున అట్టి సుధామునియద్దానవుని గర్భంబున జన్మించె యుపాయంభూహించి నొక చిత్రంబు గావించెదగాక.

సం-వ॥ (అంతలో దంబుని కడకేగిన దంబుడు నారమునిగాంచి)

-(వాదం - రూపకము)-

ధం॥ వందనములు వందనములు । వందనములు మౌనిచంద్ర ॥వం॥ ఇందు మీరు రాకడకా. నందమునాయెను నామదికి నారద దయచేయుండిక

వ॥ స్వామీ నారద మునీంద్రమ మీకిదో నమస్కరింపుచున్న వాడను కటాక్షించి మీరీ మణిపీఠంబున గూర్చుండుడు.

నార॥ ధానవకుల చంద్రాతా దస్తూదీర్ఘాభిరస్తు ॥ధాన॥ అనువుగ నీసతి సుతులు । మునికొని క్షేమమెయున్నర ముందుగనాతో వచింపుము॥

వ॥ దంభాసూర వర్ధిల్లుమి గాని నీసతిసుత దయాది భాంధవ దానవులెల్ల క్షేమంబుగయున్న వారలేకద.

ధం॥ స్వామి నారదముని నీ । కేమని తెల్పుదు నా స్థితి ॥స్వామి॥ యేమి పాపమొనరించితొ । క్రమముగ మాకును సంతతి గలుగుటెలేదాయెను యిక ॥స్వామి॥

వ॥ నారదా తాము నన్నడుగు మేచిత్రము నాకెక్కడి సుతులు సుతులు లేని మతిహీనుండను కావున నెక్కడ వారంత క్షేమంబుగనే యున్న వారు వింటిరా.

నార॥ రాక్షసేంద్ర యిదియేమి వ । రిక కాని తెలియదాయె ॥రాక్ష॥
ఈక్షితి నీసాటివారు । దీక్షతో పుత్రులగని బహు దిగ్జయమొందిరి
యింతలో ॥రాక్ష॥

వ॥ దానవేంద్రా ఇంతవరకు నీకు సంతతిగలుగకుండుట కేమి కారణమో తోచకున్నది ఐనా ఇమపరకైన ఇష్టదేవతను పూజించిన సంతానము గలుగునేమో కద.

ధం॥ మాహేశ్వర నీకును యే । మని తెల్పుదు ఇంతలోన ॥మాహే॥ గాసలో
లుడగు శ్రీహరి । దనుజుల నోర్వక చంపెను తనయులగని యేమిఫలం ॥

వ॥ కావున మాయిష్ట దేవుండగు శంకరుడు దానవులను పెంపు జేయగ శ్రీహరి వధింపుచుండెను. ఇందులకు హరికి శత్రులైన పుత్రులగనుట ఎందుకు పుత్ర దుఃఖమొందుట ఎందుకని ఇష్టవేల్పును గొల్వక యూరుకున్న వాడను వింటిరా.

నార॥ ధారుణి ఆంబారిప్యాట । శౌరిని నీమదినెంచన ॥ధారు॥ ధిరమాయు
వుగల పుత్రిని । సారసలోచనుడిచ్చును సంతోషంబున బొమ్మిక॥

గీ॥ శ్రీహరికి నీమిత్రుడై చెలగునట్టి । సుతుడుగావలెనటంచునీ వితవుగాను।
తపమొనర్చినా దైత్యాది పతియు నీకు । హరియు పొడగానవచ్చియా
వరమునిచ్చు ॥

వ॥ కావున నీవిట్లు తపంబొనర్చిన ఎల్లప్పుడు శ్రీహరికి శత్రుత్వంబుం లేక మిత్రుండై అమరావతి పాలించెటి కుమారుండు నీకుద్భవించును యిక నేవచ్చి చాల నాలశ్యంబాయెను ఇదేనే సత్యలోకంబునకేగుచున్నాడను (అని నిష్క్రమించిన ధంబుడు)

ధం-వ॥ షన్ముఖా యీ నారదుండు దెల్పిన వాక్యంబులెల్ల వింటివిగద కావున నేనిప్పుడే హరినిగూర్చి తపంబొనర్చుటకై వెళ్లెద ఇందులకు మత్ప్రాణేశ్వరియగు ధవలాంగి నా కొరకై ఎదిరిచూడకుమని తెల్పుము ఇదేనే పోయివచ్చెద.

షన్ము-వ॥ చిత్తము అట్టులనే దెల్పువాడను ఇక పోయిరండు.

సం-వ॥ అని నిష్క్రమింతురు ధంబుడా హరిని స్మరించుట.

-(దరువు - ఏకతాళం మునివర మీకిది తగునావరవు)-

ధం॥ మురళీధర గోవిందా యానందా । హే పరమ పురుష ముకుందా
మురి॥ నారదార్చితా నతజనపాలా । నారాయణ మునీనయగుణ
శీలా కారణరూపముకుందా యానందా। హేపరమపురుష ముకుందా॥
మురి॥ గోపరిపాలా గోపికలోల తాపసనుత దయజూడవదెలా । శ్రీపతి
హరిగోవిందా యానందా హేపర ॥మురి॥ పక్షివాహనా పాపవి
మోచన। మోక్షదాయకా మోహనకారణ లక్ష్మీరమణ గోవిందా॥
హేప॥మురి॥ ధారుణి శ్రీఅంబారిప్యాటపురి । ధామునన్ను బ్రోవగదె
మురారీ । కోరితినిను గోవిందా యానందా హేపరమ పురుష
ముకుందా ॥మురి॥

వ॥ శ్రీహరి శ్రీమన్నారాయణ ఆపత్కాలబాంధవా ఆపన్నరక్షక జగద్రక్షకా జనార్దన నీనామస్మరణము ఎంత మధురముగా నున్నది నిన్ను పఠించిన వారికి నీలీలారూపంబుం జూపించిన వాడవని యేనెరంగి నిన్ను స్మరింపుచున్నవాడను కావున నాపై కృపదలంచి నన్ను గనరావెందులకు ఇంకానీ నామస్మరణ పఠించెదగాక.

సం-వ॥ అని దంబుడు తపంబుజేయుచున్నంతలో (పరుద వ్రాలును వైకుంఠంబున.)

-(విష్ణుమూర్తి - లక్ష్మి - ప్రవేశం దరువు - ఏకతాళం)-

విష్ణు॥ శ్రీలక్ష్మినారాయణుడా త్రిలోలుడ భక్తుల పాలనజేసిన ॥శ్రీల॥
నీలలోహితుడ నిగమవిచారుడ । నీలవర్ణుడరా నేనిల నిఖిలోద్ధారు
డరా ॥నే॥ నేలుగానువమాదాంధుల గర్వము బోనోలినమహా । భూరి
పరాక్రుడ ॥శ్రీ॥ సారాసనేత్రూడానురా సరసీరుహాక్షుడను । సత్య
విచారుడ ॥సారా॥ పారవారగంభీరుడనె భూ । భారమణచియంటి
నిర్వేదలను మదిలోగంటి॥ని॥ ధారుని శ్రీ అంబారిప్యాట నిజ । ధాము
డనై హరిభక్తుల నేలిన ॥శ్రీలక్ష్మి॥

సం-వ॥ అంతలో విష్ణుమూర్తి యోగదృష్టిచేయున్న లక్ష్మినిగని.

లక్ష్మి-వ॥ ప్రాణేశ్వరా ప్రాణవల్లభా (అంత విష్ణు పలుకకున్న) ఏమీ ఈ నారాయణుని యేనెన్నిమారుల పలుకరించినను పలుకకున్న వాడు కారణం మరొకసారి పలుకరించెదగాక.

-(వాదం - ఏకతాళం - తెరుజు - ఉగ్రారణ్యంబును దిరుగా)-

లక్ష్మి॥ జలజాక్షా నేబిలచిన పలుకగు మీకేలను చింతా । గలిగే ఇలలోను కాంతా ॥గలి॥జల॥ నీలవర్ణ నీసఖినేగాన । ఫలువిచ్చియు పలుకవే బిరాన । పలుకకున్న నే నోపజాలనిక మీకేలను చింతా ॥

వ॥ సర్వేశ్వరా యేనెన్ని మారుల మిమ్ములను పలుకరించినను నాతో పలుకకున్న రెందులకు ఇంత అపరాధము తమకేమి జేసియుంటిని కృపజేసి మీమదింగల విచారమెట్టిదో తెల్పుడని ప్రార్థింపుచున్నదాన.

విష్ణు॥ శ్రీలక్ష్మి నేదెలిపెద వినుమిక శీఘ్రంబుగ । నదియు వేగంబున ॥నది॥ గోలరో యొకముని బాలుని కొరకై । చాలయేండ్లు తపసును జేయుటకై । నాలోయోచనచే నిను మరచితి ॥శ్రీ॥

వ॥ ప్రాణేశ్వరి నీవు సర్వంబుం దెలిసినదానవై ఏమెరుంగని అజ్ఞాని స్త్రీవలె నన్ను విచారింపుచుంటివా సరి అట్లైన దెలిపెద యిటువినుము.

కం॥ మునివరుడగు కశ్యపునకు । ధనుజుండగు విప్రచిత్తి తనయుడు ధంబుం। డను వాడు కొడుకు వడయగ । పెనుతపముగ్ జేయుచుండె పెద్దయు ప్రొద్దుల్ ॥

వ॥ కావున అమరావతిలో ధంబుండను దానవేంద్రుండు పుత్ర సంతానము కొరకై నన్నుగూర్చి పెక్కేండ్లు తపంబు జేయుచున్నందున నామనస్సు వానిచెంతకేగినందున నీతో పలుకనైతిని గదా ॥లక్ష్మి॥

లక్ష్మి॥ నీరజాక్ష మీరిందులకై మరి యోచనేమి । జేసే తీరిస్వామి॥జేసి॥ కారణకర్తవటంచు నిన్ను యిక గోరుచుందురు వేరేమిసఖి । అర యగనా కదిపరసన దెల్పుడి ॥యోచ॥

వ॥ స్వామి తాము లోకరక్షకుండవైనందున సప్తఋషులు నిన్నే గొనియాడుదురు కావున యా ధంభాసురుని వంతుకు పుత్రసంతతియున్నదా లేదా.

విష్ణు॥ ధారుణి శ్రీఅంబారిప్యాట నిజధాముడనై విను సు । ధామునికై ॥ విను॥ సారసాక్షి యీ సమయము మదిలో । కోరుచుండెనే కోమలి యిలలో సరగున ధంబుని । సరసకునేగెద ॥ధాము॥

వ॥ మనోహారి మనభక్తుండగు సుధాముని ధనుజుండవై జన్మించ గలవని మున్నా రాధాదేవి శాపంబొసంగి నది నీవెరంగియే యుందువుగద

కాపున అట్టి సుధాముని యా ధంభాసురునకు నుద్భవించునటుల వరం బిచ్చుటకై ప్రియత్నించు చుంటెను వింటివా.

-(వాదం - ఆటతాళం - కోపమేలనులే సభా వర్న)-

లక్ష్మి॥ మురహరా నామదికోరికా విచారమునదోచెనికా ॥ముర॥ అరయు గౌతమసూను దెల్పగ । వలయునా లేదా సఖా ॥ముర॥

వ॥ అహహా జగద్రక్షకా మీ యాలోచన ఇంతని చెప్ప రాదుగాని ఇప్పటంతలో నామదికోరిక విచారంబు దోచెను వినంగవలతు వేం వినిపించెద వలదన్న యూరకుండును.

విష్ణు॥ నారీమణిరో నీమది విచారమెట్టిదో నాకదీ ॥నారి॥ కోరికతో వచి యించు వేగము । కోమలీ వి.దూమదీ ॥నారి॥

వ॥ కాంతామణి నీమదింగల విచార మెట్టిదో వేగం బునం దెల్పుము అనుమానించతెగదు.

లక్ష్మి॥ చిత్రిమేమీ నిన్నికా । యా శత్రుదునుగొనియాడగా ॥చిత్రి॥ ధాత్రి పాలక నాకదంతయు । దయతో వేగము దెల్పికా ॥చిత్రి॥

ఉ॥ వారిజలోచన ధనుజ వర్యులకెల్లన్ వైరుండు వేకదా
ధీరులు వీరులందరిలో ధీగతహించి ఇంతలోనఫల్
కారణమేమివాడొక్కడు కాంక్షతో నిన్నును పెంపుజేయుచున్
కోరిభజింపుచున్నడద । కూర్మితో నాకెరంగింపు మింపుగన్ ॥

వ॥ కావున యాదానవులకు కోరుకున్న వరంబులిచ్చుటకు బ్రిహ్మాఈశ్వరులుండగా నిన్ను పూజంపుచున్న కారణం బేమి.

విష్ణు॥ శత్రుడనినను దల్చకా । పావిత్రిమొందియు వాడికా ॥శత్రు॥ పుత్రసంతతి కొరకు వాడును పూనిగొల్చెను వినుమికా ॥శత్రు॥

ఉ॥ వైరుండని యటంచునను వాడొకప్పుడైనను తలంచకన్
హరియే దైవమటుచువా నాత్మలో మరువక ఎల్లప్పుడున్
కోరిభజింపుచుండినను కోమలివానిపైదయ గల్గియున్
వరములనివ్వ బూనితిని వాస్తవ్యమింతియే మానినీయికన్

వ॥ మనోహారీ శ్రీహరికి ఎల్లప్పుడు మిత్రుండై తరించె పుత్రుండు గావలయునని కాంక్షజేసినన్ను ధ్యానింపుచున్నవాడు కావున సుధాముని వానికి పుత్రుండై జన్మించునటుల వరంభివ్వభూనితిని వింటివా సఖీ.

లక్ష్మి॥ అటులైనా సరేనికా మీరతి ముదంబున నేడికా ॥అటు॥ గట్టిగా
యీ వరమునిచ్చియు । దిట్టముగ యిటు రాండికా ॥అట్టు॥

వ॥ అహహా జగద్రక్షకా మీయాలోచన విన్న నామదికెంతో సంతోషంబాయెను సరి ఇంతలో మీరా దంబునికడ కేగి యి దేవరంబిచ్చి రాండు ఆలస్యంబుం జేయకుడు.

విష్ణు॥ మగువ నీవనురీతిగా నేవేగమున యరుదెంతుగా ॥మగు॥ బాగుగా
అంబారీషాటలో । భక్తులను సవరింతుగా ॥మగు॥

వ॥ సఖి యిదే నేదంభాసూరునికడకేగు చున్నాడను.

లక్ష్మి-వ॥ చిత్తము పోయిరాండు (అని నిమిష్క్రమించిన ధంభుండు తపము జేయుట.

-(దర్వు - ఆదితాళం - తరుజు - పశుపతియిటు)-

ధం॥ శ్రీపతి యిటు రార । నను కాపాడవ దేరా ॥శ్రీప॥ పావమేమి నేరనునా
దాపు జేం వేరా ॥శ్రీప॥ కరినిగాచినట్టి బల్ ఘనుడవీవుగట్టి ॥క॥ మార
జనక నీదుస్మరణ । మరువనుపట్టుబట్టి ॥శ్రీ॥ భాసురాంగనీకు నేదా
సుడ మరువాకు ॥భా॥ జేసిన నేరము క్షమించి । దాసునివ్వమాకు ॥
శ్రీ॥ దీనలోక పాలనను । గానగ రావేలా ॥దీ॥ శూనశరణ్యానీకను
అనుమానమదేలా ॥శ్రీప॥ అంబారీషాట నిజ । వానుకవని నోటా॥
అం॥ సంభరంబుతోడనిన్ను । సన్నుతించితీం ॥శ్రీపతి॥

శా॥ నీవే విష్ణుఁడ నీవె పద్మజుడవు న్నీవె మహేశుండున్
నీవే సిద్ధులు దివ్యులున్ మునులునున్ నీవేజగద్గోలముల్
నీవే కర్తవు నీవె భోక్తవునుద్రీ నీవేకద భూతముల్
నీవే నేతవు ధాతవు నన్నేలుము నిరాకర శ్రీహరి ॥

వ॥ శ్రీహరీ నాపై నీకింక కరుణరాకయున్నదా దేవా.

సం-వ॥ అంతలో విష్ణుమూర్తి ప్రత్యక్షంబై దంబునిగని.

విష్ణు-ఉ॥ మెచ్చితి నీదు పూజనము మేలగు నీదగు కోర్కెలెవ్వియో
హెచ్చగ నిచ్చెదన్ వరము యేమిగోరుదువో యిక నీయెదన్
మచ్చికచే నచ్చితిని అనుమాన మదేలను నీమనంబునన్
ఇచ్చతో నీవునన్నుకను విప్పికనుంగొను ధనుజాదిపా ॥

వ॥ భక్తాగ్రేసర ధంభాసూర నీవెవరిని గురించి వేడుచుంటివో అట్టిఘనుండు ఇంతకుదెంచియున్నవాడు కనువిప్పి కనుంగొనుము.

సం-వ॥ అంతలో దంబుడు విష్ణుమూర్తిని గాంచి.

ధం-వ॥ శ్రీహరి శ్రీమన్నారాయణ మీ పాదంబులకిదే ప్రణమిల్లుచున్న వాడను కటాక్షించుడు.

విష్ణు-వ॥ ధంభాసూర వర్ధిల్లుము గానీ నీకేమి వరంబు గావలయునో కోరు కొమ్ము యేనుతప్పక నిచ్చువాడను.

ధం-కం॥ నీయందు భక్తుడై కడు । శ్రేయంబులు జెందువాడు శ్రీరమణీశా ।
గేయగుణాఢ్యుని పొడమగ । జేయుము కృపజేసి సంత సింతును నేడున్ ॥

వ॥ కావున నీయందు భక్తిగలవాడు ఇరువైనబలంబుల గలవాడొక పుత్రునివ్వుము దేవా.

విష్ణు-గీ॥ నీవు గోరినట్టి వరంబు నింతలోన । యిచ్చితిని నీకు యిరువైన
బలములు గల. కొమరుడు జన్మించుగోలోక గోపుడౌ సుధాము
డారాధికాశాప ధానవిధియు ॥

వ॥ దంభాసూరవింటివా అట్టిసుధాముండు నీగర్భంబున శంఖ చూడుండై జన్మించగలడు పొమ్ము నీకిదియే సెలవు యేనిదే వైకుంఠంబున కేగుచున్నవాడను.

సం-వ॥ అని విష్ణుమూర్తి దృశ్యుండైన దంభాసూరునిజగృహంబు నకుం జేరంబోయిన నచ్చట దవళ చెలితో.

ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

# ద్వితీయాశ్వాసము

అవరావళిలో శంఖచూడ జననము.

ధవలాంగి చెలితో ప్రవేశం - దర్వు - ఏకతాళం (కమలాయు)

ధవ॥ జలజాయాతాక్షరారా । పాలించవదేరా ॥జల॥ పాలించవదేరా
పద్మాక్షుడవరా । కొలచితిరా తలచితిరా ॥జల॥ ఉక్కూస్తంభాము

వందమా నుదయించితివిరా । నుదయించితివిరా సదయా పుడవేరా
త్రొక్కితిరా । దక్కితిరా ॥జ॥ కరిరాజు నిన్నువేడ । కరుణిం
చితివిరా కరుణించితివిరా । కాపాడితివిరా మొరవినరా దొరరారా॥
జ॥ ధరణి అంబారిపాట శౌరివి నీవెరా । శౌరివినీవెరా మురహరి
వీనీవెరా । కరుణించుమా మదినెంచు ॥జ॥

వ॥ దేవా జగద్రక్షక నిన్ను గురించి నున్నవోహారుండు పెక్కేండ్లు తపంబుజేయుచుండెను కావున అట్టి తపంబు విఫలంబుజేయక మాకు పుత్రి భిక్షమొసంగుము దేవాయమ్మ బోవ్రుదాత వీపుగావ (అంతలో చెలి ధవ శనుగాంచి)

చె-వ॥ అమ్మా ధవళాంగిని అదోమన ధంభాసూర దానవేశ్వరుండు అంత పురంబునకు విచ్చేయున్న చువాడు ఎదురుంజని నమస్కరించుము.

ధవ-వ॥ చెలి నేననుకు నెవరకు మత్ప్రాణేశ్వరుండురా నేవచ్చుచున్న వాడ సరి మంచిది యెదురుంజని నమస్కరించి అట్టి సమాచారమెట్టిదో యడిగి తెలుసుకునియెదగాక (అని దంభునిగని ప్రాణవల్లభా మీ పాదంబులకిదో పదివెయుల వందనంబులాచరింపుచున్నదాన కటాక్షించి మీరుంబోయి వచ్చిన సమాచారంబెట్టిదో తెల్పుడని కోరుచున్నదాన.

ధం-వ॥ సఖిమణి వర్ధిల్లుము గాని అట్టి సమాచారంబు దెలిపెదను ఇటు వినుము.

పాదం - ఏకతాళం - (తెరుజు అనఘునవ్రా)

ధం॥ ప్రాణనాయకి యేమనగను । వంకజాక్షుడొసగిన వరము॥ ॥ప్రాణ॥
ఘనుడు ఇదువెన బలమూలాగల । తనయుడును జన్మించుననియె॥

వ॥ జీవితేశ్వరి యాపంకజాక్షుండు నాతిపః బు మెచ్చి లెంకి లెంకి చూచి గోలోక గోపుండగు సుధాముడు మన గర్భంబున శంఖచూడుండై జన్మించగలండని వరంబిచ్చి పోయెను వింటివా సఖి

దవ॥ యేనాటి పూర్వజన్మ ఫలమో । యీనాడు ఇంతలోన గలిగె ।
యేనా॥ గానలోలుడైనట్టి శ్రీహరి । కరుణయేమాని వాడుకుందుగ॥

వ॥ అహా ప్రాణవల్లభా ఇప్పుడుగదా నామనం బానందబాయెను సరి మీకెంత క్షుధయగుచున్నదో అన్నముభుజించి అలసట దీర్చుకుందురు రాండు.

దం॥ కలికి రతిక్రీడలఁ సల్పుదము । సుళకినను జేరరమ్మ వేగఁ ॥కలి॥
యలుకు జెందె నామనంబు కిపుడు । చలను దేలనీ మనంబునందుఁ ॥

వ॥ సుందరీమణి నిన్నుజూచినంత మాత్రంబుననే యామరుండు శరముల గ్రుమ్మచున్నవాడు కావున నీవింతలో నన్నుజేరి రతి సుఖంబులో సంతృప్తి జేయుము లేకయున్ననే నోపజాలను.

దవ॥ యిలను అంబారివ్యాట హారియే । పాలించుమనంబ మరువకఁ ॥యి॥
సేలుగానువాదు చెంతజేరి । కేళిగూడుడీ యింతలోనఁ ॥యిల॥

వ॥ జీవితేశ్వరా మీకింతలో ఈ వ్యామోహము కలుగుటకు యా శ్రీహరి కారుణ్యమేకాని మరేమిగాదు సరి మీ మనోభ్రాంతి దీర్చుకుందురు లోనికి రాండు.

దం-వ॥ సరి మంచిది పదమ్మ.

సం-వ॥ అంతలో ధవళధంభాసురులు కేళికా గృహంబునకుంజని ఇష్టభోగంబులు సల్పిన కొన్ని దినంబులకు ధవళాంగి గర్భంబుం దాల్చి చెలితో యిట్లనియె.

ధవ-వ॥ సఖి చంద్రముఖి యొక విచారము.

చెలి-వ॥ అమ్మా ధవళాంగిని అదియెట్టి విచారము వచింపుము.

వాదం - ఏకతాళం - (తరుజ రారాధీలోలా)

ధవ॥ కలకీయిక యేనూ నీతోను । దెలుపగ సిగ్గగునూ ॥నీతినూ॥ నీలాలకి
నీవే మందువాయని । చాలగ నామది సంశయ మొందితి ॥క॥

వ॥ నెచ్చెలి నాముచ్చట నీతో దెల్పుటకు నామది సిగ్గగుచున్నది అదియేమని తెల్పుదానను.

చెలి॥ గోలా నీమదికి విను సిగ్గేలనె మరుముళకీ ॥వినూసి॥ నీలోగలదదీ నేడే
దెలిసెనిక । సీలానీవును బాలుని ననెదవు ॥గోలా॥

వ॥ తల్లీ ధవళా నీవు నాతో దెల్పక ఇంక యెన్నిదినంబులు దాచి పెట్టుకుందువు విదియనాడగుపడని చంద్రుడు తదియనాడు తానకు తాన అగుపడుచున్నట్లు నీసంగతంత యేనుమున్నే దెలుసుకున్నదానను అది యెటులన్నను నీగర్భంబున చక్కని బాలుండుద్భవించునని నాకుం దోచంబడుచున్నది వింటివా.

ధవ॥ బోటీమణి యేను యీ వేదనా । కెటులోర్తును యికను ॥యీ వేదనా॥
కటకట యికనా । కడుపుల నేమో కదలుచు మెదులుచున్నటు
దోచెను గదె ॥బోటీ॥

వ॥ సఖి అదంతట్లుండనిమ్ము గానీ ఇప్పటంతలో నాగర్భంబున
నేమొ కదలి మెదులుచున్నట్లున్నది ఇక యీ వేదన భారినుండి యేనెట్లు
కడతేరుదునో కదే.

చెలి॥ యేటికి నీవిటులా తొందరా।పడగవలదు లతలా ॥తొంగరా॥ మాట
దప్పకను మంత్రసానుల । హాటకాంగి నీవద్దనుంచుదును ॥యేటి॥

వ॥ తల్లీ మేమందరము నీవెనువెంట యుండగా నీకెట్టి కష్టంబులం
టవు నామాట నమ్ముము.

ధవ॥ నొప్పుల ధికమాయే చెలినా । కిప్పటంతలోన ॥చెలి॥ నొప్పదు
నామదీ కిప్పుడుయేమో । చెప్ప రాని చెమ టుత్పన్నంబయే ॥నొ॥

వ॥ చెలీ ఇప్పటంతలో కడుపునొప్పు లధికమయ్యె నాతనువెల్ల
బుగబుగ చెమట లుత్పన్నంబగుచున్నది ఇకనేమి సేయుదాన ఈవేదన
భారికి యేనొక్క క్షణంబైన తాళలేను ఇందునుండినన్నెట్లు కడతెర్తునో
కదే.

చెలి॥ పడతీ యికనేడూ నీవు సుఖా । ప్రసవాదువు చూడు ॥నీవు॥ అనవ
రతము అంబాశివ్యాట శ్రీ । గానలోలుడే కడతేర్చును నిను ॥పడ॥

వ॥ అమ్మా ధవళా నీవిట్లు తొందర పడవలదు కొంచెము తాళు
కొమ్ము.

దర్వు - ఆటతాళం (వరుస - యేతీరుబోయెద)

ధవ॥ తాళజాలయేమిసేతు దైవమ నేడు । ఇక । తాలుకొమటకను మదిక।
ధైర్యముగాదు నీలాలకియిప్పుడు ॥తా॥ నిలువెల్లచమట నుత్పన్నం
బయ్యె । సింతలోన దేహమును పరవశమయ్యె । భల్ చెలిభుగు
లయ్యె ॥తా॥ అక్కనకును పిండము యెదురెక్క నెకొమ్మా ।
మక్కువతో ముప్పును నన్ను। మనుచ రాదమ్మా దిక్కనను బ్రోవుడి
యికెవ్వరిక్కడనమ్మా । నేదక్కడదమ్మా ॥తా॥ మంత్రసానులను
బిల్వరె మగువలుమీరు । మంత్రజ్ఞుల ఔషధ మందివ్వగలేరు యంత్ర
తంత్రములనూ యేర్పాటు జేయరే ఈవేల్లనుమీరే ॥తా॥ కన్నా

పెంచిన కాంతలు గనరారేలా। మన్నించిన కష్టములను మాన్పరాదేలా। సన్నుత గుణశాలులనీ యెన్నదివేలా। మన్నించుమడిశీలా॥ తా॥ ధారుణి అంబారిప్యాట। దామ మురహారి కోరినిన్ను వేడితి నన్నేలు నరహారీ। వరదాయకుడంచు నిన్ను నమ్మితిశౌరీ। కరుణించు శ్రీహరీ॥తా॥

చెలి-వ॥ తల్లీ నీకిప్పుడే ప్రసవసమయంబగుచున్నది లోనికింబోవుదము రమ్మా.

ధవ-వ॥ సఖీమణి నాకెంతమాత్రంబైన లేచి నిలువంబడుటకు చేతగాకయున్నది. నన్ను బట్టుకొని మెల్లమెల్లన ప్రసవ గృహంబునకు దోలుకపోందూ.

చెలి-వ॥ సరి మంచిది ఇదో నీహస్తము పట్టుకొంటిని ఇక లేచి నిలువంబడుము లోనికి దీనుకపోదుము.

సం-వ॥ అంత ధవళ లోనికింజని కుమారుని గని సంతోషముతో చె

ధవ-వ॥ సఖీమణి ఇదో మతొక్కమార రత్నంబుంజూచితివా.

చెలి-వ॥ అహాహా ఈ బాలుని సౌందర్యంబేమనవచ్చును తల్లీ యిక సంతోషమొందుము.

దర్వు - ఆదితాళం - తరుజ - ఆహా యీ (పుత్రికలెం)

ధవ॥ ఆహా యీబాలుండెంతానందంబుగ నున్నడుగా ॥అహా॥ మహాసంతోషము గలిగే। మమతలు ఫలియించే ॥అహా॥ చుక్కలరాయుని మించిన। చక్కదనము వీనిమోము యిక్కాల్కము వీనిబోలు। వాక్కబాలుడై నగలర ॥అహా॥ చిగురుటాకుల స్తములు। సొగసుకు తగినా కనులు బాగుబాగు వీనిమోము। భ్రమనీరగ వీక్షించెద ॥అహా॥ ధారుణి అంబారిప్యాట। నీరజాక్షు సన్నిపూట కోరిభజించెద నాకొమారు నేలుమీ జగమున ॥అహా॥

సం-వ॥ అంతలో ధంబుండచ్చటికివచ్చిన ధవగని ఇట్లనియె.

ధవ-వ॥ మనోవల్లభా ఇదోమన కుమారుని వీక్షింపుడు.

ధం-వ॥ అహాహా ప్రాణనాయకీ ఈబాలు వీక్షింపగా నామదికెంతో సంతోషంబాయెను గానీ వీనికి జాతకర్మము జాయించి నామకరణంబుగావించుటకు బ్రాహ్మణోత్తముల రావించవలయునా తెల్పుము.

ధవ-వ॥ చిత్తము అట్టులనే రావించుడు గానీ అదో త్రిలోక సంచారియగు నారదులవారు మన గృహంబునకు విచ్చేయుచున్నవారు కనుంగొనుడు.

నార-దర్వు॥ నారాయణశౌరీ । నరహరి ॥నారా॥ నారాయణ నీనామమెం
మధురము కారణరూప మురారి పరారి పరాత్పర ॥నారా॥

సం-వ॥ (తనలో) ఏమీ ఈ సమయంబున సుధాముడు ధవళాంగి గర్భంబున నుద్భవించెనట కావున అట్టి బాలుని వీక్షించి వచ్చెదగాక (అంత దంబుడు గని)

ధం-వ॥ స్వామీ నారదమునీంద్రమా మీకిదో నమస్కరింపుచున్న వాడను కటాక్షించుడు.

నార-వ॥ హేధవళాంగి ధంభాశూర దంపతుల్లార వర్ధిల్లుడు గాని ఈబాలుండెవరి కొమారుండు గాబోలు.

ధం-వ॥ నారదా మీరునన్నడుగుటమే చిత్రము హరి వ్రతప్రసాదంబున జన్మించిన మత్కుమారుండిదో చేకొని వీనికి జాతకర్మంబుజూచి నామకరణంబు జేయుండని కోరుచున్నవాడను స్వామి.

సం-వ॥ అని బాలుని నారదుల కొసంగినంత నారదులు ఇట్లనె.

నార-వ॥ అహహా ధంభాశూర ఈ బాలుని వీక్షించగా నామదికి మహాసంతోషంబాయెను సరి నీ కుమారునకు నామకరణంబుంజేయుచున్న వాడను ఇటు వినుము.

గీ॥ అరయగ శంఖచూడుండనగ నొప్పు । వీడుబాహుబలాడ్యుడై ఇహము
నందు । పేరుగాంచియూ ధనుజులా ప్రియముమెంచి । అమత్యపదవి
నేలునూ నతిమోదమునా ॥

వ॥ ధంభాశూర వింటివా ఇప్పటినుండి ఈ బాలుని శంఖచూడుండని పిలువవలయును ఇక నేవచ్చి చాలనాలస్యంబాయెను. యిదే నే సత్యలోకం బున కేగుచున్నవాడను.

ధం-వ॥ స్వామీ నారద మరచితిని నాకావంకజాతుండు కూడ ఇట్లే పిలువుమని చెప్పెను । కావున సమయానికి మీరువచ్చియదే పేరు పెట్టితిరి కృపయుంచి పోయిరాండు (అని ధవళనుగాంచి మనోహారీ ఇదో బాలుండు హాటంబు జేయుచున్నవాడు చేకొనుము.

ధవ-వ॥ సరి మంచిది యిటు దేండు (అని బాలుని దీసుకున్న చెలి.

చెలి-వ॥ తల్లీ ధవళా బాలుండు నిద్రకు వచ్చి హటంబు జేయు చున్నాడు లాలిపాట బాడి పరుండబెట్టుము.

ధవ-వ॥ సరి అటులనె లాలిపాటబాడి పరుండ బెట్టుదము తొట్లెలో వస్త్రంబులు వేయుము.

—(లాలిపాట - దర్బ్వా - ఏకతాళం)—

ధవ॥ లాలీ ధనుజేంద్రతనయా । లాలీ సౌందర్యా విసయా । లాలీ కరుణాలవి దేయా లాలీ సుశ్రీయ ॥లాలీ॥ నినుగనుటకు పూర్వామందూ నేనోచిన నోము ఫలించీ । ఘనుడవుమా గర్భామందూ జనించితీ వింద ॥లాలీ॥ వెన్నెలరాయుని మించా మిన్నైయున్నవు నినుగాంచా। చిన్నితనయా నిన్నెంచా చింతాలు దొలిగె ॥లాలీ॥ ధరణీ అంబారి ప్యాటా ధాముడై నట్టి మురారీ । కరుణించి బ్రోవగలడు కాంతుతో నిన్ను ॥లాలీ॥

చెలి-వ॥ అమ్మా ధవళబాలుండు నిద్రజెందియున్నవాడు మన మిచ్చట చప్పుడు జేయ తగదు లోనికి బోవుదము రమ్మా.

ధవ-వ॥ సరి మంచిది పమ్మా (అని నిష్క్రమించిన పరుదవారలును)

—(పాఠశాల బాలురు ప్రవేశం)—

రా-వ॥ ఓరే లక్ష్మీకాంతము వెంకటేశము మహమ్మదు సేక్ యేనొక్క మాట జెప్పెద ఇటువినుండు

ల-వ॥ ఓరే రామస్వామి అదియెట్టిమాటయో చెప్పర మేమంద రము వినుకుందుము

—(వాదం - జుల్వ)—

రామ॥ ఆటలాడుకుందమా । పాఠశాలలోన మనము ॥ఆట॥ భూటకంబుగా దికా । మాటికిఖ్యారంబికా సూటిజూచి గోటజిమ్మచు ॥ఆట॥

వ॥ ఓరే లక్ష్మీకాంతము మా మ్యానత్త కొడుకుయగు శ్రీశైల్యంఖ్యారంబనే ఆట క్రొత్తగా నేర్చుకవచ్చి నాకుంనేర్పెను కావున యేను మీకు నేర్పెద మీరు నల్వురు నాల్గు దిశలకు గూర్చుండుడు.

లక్ష్మీ-వ॥ ఓరే రామస్వామి అదేమాటర నీవుండాట ఏ నొక్క నాట దెలిపెదను ఇటు వినుండు.

లక్ష్మి॥ హుత్తు తలాడ్డమా । చిత్తములో మనము యిపుడు ॥హు॥
మొత్తము మన మందరము చేయెత్తి లేపుడి । సత్తుజేసి యింత
లోన ॥హుత్తు॥

వ॥ ఒరే రామస్వామి మనవంటి పాఠశాల బాలుగు ఈ హుత్తు త
యాటనాడుకొనవలసిన పద్ధతి కావున మనమెందరమున్న మోలెక్కింపుడు.

వెంక॥ వినర లక్ష్మీకాంతము కను । గొనగ యేను దెల్పెదాను ॥విన॥
అనువుగ మద్దిరంగమమున । మాడవలె యిక వెనుదీయకుడీ
మీరను ॥విన॥

వ॥ ఒరే లక్ష్మీకాంతము వింటివా నాపందెము పులి నీపందెము
మేక పులిని దప్పించుకొని మ్యాక బయటకు వెల్లిన నీవు గెల్చినట్లు లేక
పులికి మ్యాక జిక్కినట్లైతె యేను గెల్చినట్లు గిట్లాడు కుందామంటె
రామస్వామేమో క్యారంబాడుదామంటాడు నీవేమో హుత్తు త్తలాడ్డా
మంటావు హుత్తుత్తలాడ్డె కాళ్లిరిగిపోవుర ఇక నీవె చెప్పు.

మ-వ॥ దూత్తేర్ ఆవ్వేమాటల్ జారి ఏనొక్క నాటాడి చూపిం
చెద ఇటు జూడుడు

మహా॥ తక తత్య లాడ్డమా । బెకబెకయనుచును మనము ॥తక॥ తకత॥
యని పాడుడీ । చెక్ చెక్ యనీ యెగురుడీ పకపకయని నవ్వబోక ౪

వ॥ గీయాటలాడాలంటె క్యారంబట మద్దిరంగమట హుత్తుత్తలట
ఓరే రామస్వామి ఈ యాట బాగుండును ఏది మీరంత నాతో యెగురుడు.

రా-వ॥ హేబాలులార మనమీ యాటలన్ని మాని పాండురంగని
భజన జేయవలయును ఇటు వినుండు.

రా॥ రంగరంగ యందమా । పొంగుచు గంతులు వేయుచు ॥రంగ॥ చెంగ
లించిదుముకుడీ చేతులెత్తి (మొక్కుడీ। సంగడిచేడెలగూడుక ॥రంగ॥

వ॥ ఓరే లక్ష్మీకాంతము ఏను మొదలే పాఠము జ్ఞప్తి జేయక
యుంటిని ఇక పంతులు వచ్చి కొట్టునేమో యని ఇంతలో చింతగలిగెను
కావున మనమీ నాటలు మాని పాఠంబులు చదువుకొందము రాండు.

లక్ష్మి॥ అంబారిప్యాట శ్రీనివాసుండే మేలునగనల ॥అం॥ సంభరంబునొందుడీ
సంశయించబోకుడీ । చదువుడి పాఠములింతలో ॥అం॥

వ॥ ఓరె వెంకటేశము అదో మన ఆచార్యులవారు వచ్చుచున్నవారు ఎచ్చోటి వారచ్చోట కూర్చుండుడు(అని బాలురుకూర్చుండినంతలో)

బైగీపాచార్యుల ప్రవేశం - దరువు (అఠ్యాడలు)

బైగీ॥ బైగీపాచార్యుండనుచును నను। బాలురమది గొనియాడగను ॥బై॥
అగనితముగ హరిదర్శణమునకై। యోగముదెల్పెటి మాన్యుడను॥
బై॥ వేదములాది పురాణములన్నియు। చదివివ్రాసినా చార్యుండర్
వాదభేదములు మదిలోదలంచక। బోధలుదెల్పెటి బుధహితుడర్ ॥
బై॥ ధర్మాధర్మములను గుర్తించిన। ధైర్యుడ ధయగుణశాలుండర్
కర్మరహితములు కడకు ద్రోచిబల్। నిర్మల మొందిన నిజగురుడర్ ॥
బై॥ యేదినిజంబని యోచిన వారికి। సాధనజూపెటి సుచరితుడర్ కాదని యెంచేమాయ మదాంధుల। మదమడగించిన మతపరుడర్ ॥బై॥ పొంకమైన అంబారిప్యాట శ్రీఓంకరేశు నెల్లప్పుడును।
సంకటములు యెడబాపుమనుచునే। సాధించియు పూజించెదను॥
బైగీ॥ (అంతలో రామస్వామినిగని)

వ॥ ఓరే రామస్వామి పాఠము జదువక నాటలాడుచుంటిరాయేమి ఏది నీపాఠ మప్పగించుము.

రా-సీ॥ శివలింగమును జూచి చేయిమోడ్వనట్టిడు। శివగుడిక్ బాలుతుక జెందునతడు। శివధనంబుల ద్రుంచు కొనుతిను నాతండు। శివరాత్రి భలుపభోజేయు నతడు। శివవని పుష్పరాజినిదెచ్చునట్టిడు। శివపూజమాని భుజించునతడు। శివుసరి పెఱవేల్పు చింతజేయు నతండు। శివుని వ్రతంబుల జెరుపునతడు ॥గీ॥ గురుని గొలువక పాఠంబు గోరునతడు। గురుని పరిచర్య సల్పనీ కుత్సితుండు। ఆపదర్ గుందు గురుబాసి నట్టియుతడు। చేరుదురు నిరయంబును సిద్ధమద్దీ ॥

బై-వ॥ ఓరే రామస్వామీ ఈపద్యము నేపెట్టించినదికాదుగద ఈపద్యము నీ కెవరు పెట్టించిరి.

రా-వ॥ గురువర్యా ఈ పద్యము శ్రీమాన్ నాగులప్యాట ఆదెపు రామానుజాచార్యులవారు మొన్న పుల్లిరాజయ్య పంతులింటికివచ్చినప్పుడు నన్ను బిల్చుకొని ఈ పద్యము పఠించుమని వ్రాసి ఇచ్చెను వింటిరా.

బై-వ॥ ఏమిా నాగులప్యాట ఆడెపు రామానుజాచార్యుల వార ఓహోహో అతండు పరిపూర్ణ భక్తుండ నంబడును సరి ఓరే లక్ష్మీకాంతము నీపద్య మప్పగించుము.

లక్ష్మి-ఉ॥ కల్లలనాడు గురు కాంతలనోడక దిక్కరించు వా
డుల్లమునందు నక్కటిక మూనని వాడభి చారకృత్యముల్
పొల్లుగ పల్కువాడు ద్విజులచ్చియు నుంతయునీయక పంపువా
డొల్లముపాడు లౌద్విజుల నూరకదూరెడు వారు పాతకుల్ ॥

బై-వ॥ ఒరే లక్ష్మీకాంతము ఈ పద్యము నీ కెవరు పెట్టించిరిరా.

లక్ష్మి-వ॥ ఆచార్యా ఈ పద్యము అంబారిప్యాట శ్రీరాముల కిష్టమాచార్యులు నిన్న మన పాఠశాలకు వచ్చి నాకీ పద్యము పెట్టించెను వింటిరా.

బై-వ॥ ఏమిా కిష్టమాచార్యుల అతండు నాటకపంతుల నంబడును సరి మంచిదిగానీ ఓరే వెంకటేశము ఏది నీ పాఠమప్పగించుము.

వెం-సీ॥ అశుచియై వేదాధ్య యన మొనర్చునతండు । తల్లిదండ్రుల నెప్వ డొల్లనతడు । పంచయజ్ఞంబుల బాసి మెక్కునతండు । తనుగొప్పగా నెన్ను కొను నతండు । చదివిన వేదంబు వదలి మరచినట్టి డాలను బోగుల కమ్మునతడు । దేవభూదేవ వృత్తిని జారగొన్నట్టి డాల మందలు మేయునట్టి పొలము ॥గీ॥ నాకశ్రమించినయట్టిడు। నాల తెరువు । నందునగ్గినీ వేసెడు నట్టియతడు । దీనులగువారి సొత్తు నెంతేని గొనిన । యట్టివారును నరకంబు నందగలరూ ॥

బై-వ॥ ఓరే వెంకటేశము నీవీ పద్యమెక్కడ నేర్చుకవచ్చితివిరా.

వెం-వ॥ ఆచార్యా సిరిపురము చెన్నూరు గంగ రామాచార్యుల వారు మొన్నమన గ్రామానికి వచ్చినప్పుడు నాకీ పద్యము పెట్టించెను వింటిరా.

బై-వ॥ ఓహో చెన్నూరు గంగరామాచార్యులవార అతండు జోతిష్యపండితుండనంబడును సరి మంచిది గానీ ఓరే మహామ్మదుసేట్ ఏది నీపద్యమప్పగించుము.

మహ-వ॥ అల్లాహులా యిలాహాబిస్ । మిల్లాహిర్ రహీం యనక బిరాన వాడుట్ । కోల్లను గొర్లను గోసుక । ముర్దాల్లను దిన్నట్టి వాడు తురుకో నెట్లుట్ ॥

బై-వ॥ ఓరే మహోమ్మద్ నీకీ పద్యము ఎవరు పెట్టించిరి.

మ-వ॥ పంతూల్ ఈ పద్యము మా కులగురుండగు భుసర్డాప్రవ్యాట దూదేకుల ముల్లాను సాహేబు నిన్న మన గ్రామానికివచ్చి నన్ను బిల్చుకొని ఈ పద్యము గట్టిగ జ్ఞప్తిజేసుమని పెట్టించెను ఇది ఏమైన జూటా ఉన్నది సార్.

బై-వ॥ ఏమీ ముల్లాను సాహేబు పంతులా ఆంగ్ల రాజాఖ్యునికి బాల్యమందు విద్యనేర్పిన ఉస్తాదరంబడును సరి ఈ పద్యము మీ కుల భావనకు జెప్పుకున్నడు గానీ ఓరే ఓరే రామస్వామి నిన్న మాపటివేల నీవు చదువుచున్న పద్యము వదిమళ్లీ చదువుము.

రా-సీ॥ భూదాన మొనరించి భూమినీయక తామె । యనుభవింపుచు నున్న యట్టివారు । గోదాన మొనరించి గోద్రవ్యము ను తామె । యారగింపుచునున్న యట్టివారు । కన్యదానము నక్కదజేసి కూతురును । నల్లునికంపకున్నట్టివారు । సత్రంబులమరించి చాలగన వ్వాని । యద్దెలకిచ్చు కున్నట్టివారు ॥గీ॥ జిన్నములోనర్థమనుచు విస్తార ధనము । యార్జన మొనర్చి యటునుంచనట్టివారు । విత్తన ముల నప్పగొని వెగావేయువారు । చేరుదురు నరకవార్ధినీ సిద్ధము గను ॥

బై-వ॥ రామస్వామి ఈ పద్యమెవ్వరో పెట్టించిరంటివి.

రా-వ॥ శ్రీమతి సుశీల దొరుసాని జగత్ప్రసిద్ధి వహించుకొరకు ఈ పద్యము రాజాఖ్యునిచే రచనజేయించి మా పాఠశాల బాలురకు విసపించినది గురువర్యా ఇట్టి పద్యార్థమేమి.

బై-వ॥ ఏమీ ఇప్పటి పద్యము సుశీల దొరుసాని రచన జేయించి నదా సరి ఈ పద్యర్థము దెలిపెద ఇటు వినుండు.

బై-కం॥ బాలురకు చదువు జెప్పించుట । యోలిగ నన్నంబుబట్ట లొసగుటయు గదుర్ । పీలుగ బొత్తములిచ్చియు।చాలగ కృతిజేయించు వారికి సంపదలిమ్మర్ ॥

వ॥ కావున అన్నవస్త్రదానంబులు జేయువారు బాలురకు చదువు జెప్పించి కృతిజేయించువారు కీర్తినొందుదురని వేదశాస్త్ర పురాణంబులు దెల్పుచున్నవి సరి మంచిదిగానీ నేటి దినంబున శంఖు...డుండు పాఠశాలకు రాని కారణమేమి.

రా-వ॥ ఆచార్యా మీరను నంతలో అదో శంఖచూడుండు రానే వచ్చుచున్నవాడు కనుంగొనుడు.

సం-వ॥ అంతలో శంఖచూడుడు వచ్చి ఆచార్యులగని.

శం-వ॥ ఆచార్యా మీకిదో నమస్కరింపుచున్నవాడను కటాక్షించుడు.

బై-వ॥ శంఖచూడా వర్ధిల్లుము గానీ నీవింత నాలసించి వచ్చిన కారణం బేమే అది యుంగాక నీవేమొ చాల యోచింపుచున్న వాడవు అదియెట్టి యోచన.

—(వాదం - యేకతాళం - తరుజా సుగీ)వాలంకకి)—

శం॥ ఆచార్యా యింతలోనా । యోచన యేమందికా ॥అచా॥ తోచదీ
సృష్టిపాలన । జేసేవారెవరికా ॥అచా॥

ఉ॥ ఎవ్వడు సర్వభూతముల కెల్లపురాణుడు గాదనర్చునిం
కెవ్వడు శాశ్వతుండు పరమేశ్వరుడెవ్వడు నిత్యశుద్ధుడౌ
నెవ్వడు చిత్రికృత్యముగ నెవ్వనిచే జనియించెనీ జగం
బెవ్వనియందు సర్వముల యించునో నాకెరుంగగ జెప్పుమా ॥

వ॥ గురువర్యా తాము సకల శాస్త్రపురాణేతిహాసంబులెల్ల నాకుం దెల్పియుంటిరి గాని ఇట్టి సృష్టికి ఆధారులెవరు ఈ సృష్టిని నిర్మించినవార లెవరో తోచకున్నది సవిస్తారమంత నాకుం దెల్పుండను కోరుచున్నవాడ.

బై॥ కారణాకర్త అష్ట । శ్వరబ్రిహ్మ ముగ్గురు ॥కా॥ నేరుపుతో
యీ ముజ్జగముల । నేలుచునున్నరూ ॥కా॥

ఉ॥ నిర్గుణులై యఖండమయి నిత్యమునై శివమై యానన్యకం
సర్గమునై ప్రకాశిలెడు సారసరోత్తమ తేజమీ జగ
త్సర్గముగోరి చెల్వమరె శక్తిశివాఖ్యల స్త్రీపుమాంసులై
నిర్గతమైన యక్కవనె నేరిమిగారణ మయ్యెసృష్టికిన్ ॥

వ॥ కావున కారణకర్తయైన సర్వాంతర్యామి ఈశ్వరుండు బ్రహ్మాదీవిష్ణు ముగ్గురు ఈ సృష్టిని యొనర్చి పరిపాలింపుచున్నవారని తెలుసుకున వలయును వింటివా.

శం॥ ముగ్గురిలో శ్రేష్టులెవరో । ముదముతో వినదెల్పుమా ॥ము॥ కర్గా
మిని ఏను యిపుడు । గనబోదునూనుమా ॥ము॥

సీ॥ ఎవనిచేతను దిరిగెడు నెల్లవిశ్వ । మెవనియోగులు గొలుతురు హృదయ
మందు । నెవనితేజంబుచే విశ్వమెల్ల వెలుగు । నాత్రిలోచను శైవ
డౌనా కెరుకజేయు ॥

వ॥ ఆచార్య ఈ ముప్పురి త్రిమూర్తులలో ఎవరు శ్రేష్టులనంబడును
యోగులు ఎవనిని గొల్తురో వినంజేయుడు స్వామి.

బై—వ॥ (తనలో) బహూశా ఈ బాలునికి నేనేప్పు జ్ఞానమార్గములు
దెల్పినను మరొక్క లెక్కువగానే ప్రశ్నలిచ్చుచున్నవాడే వీడు తపోగరిష్టుం
డగునా యేమి సరి మంచిదింకకొన్ని మార్గములు దెల్పెదగాక.

బై॥ త్రిమూర్తులేకమనియు ॥ తెల్యుమి నీమనమునా ॥త్రి॥ ఇద్దు హి
అంబారివ్యాట । ఈశులను దల్వుమా ॥త్రి॥

ఉ॥ మూగురు కారణాత్ములు సంమున్నతులా పరమేశ్వరాత్మజుల్
యోగధనుల్ విరించి హరి సోము లు శాంభవ శాసనంబునన్
గాదుగ విశ్వసర్గపరిపాలన సంహృతులన్ బొనర్చుచున్
లోగగజేయునొండొరుల లోనదలంచిరికడున్ జవంబునన్ ॥

వ॥ కావున యెవరి ప్రేమభావము ఎటు లుండునోయని తెలుసు
కొనుటకీ యవతారంబులు ధరించియుండి ఇాదులకు తెల్వని వారలు వేరు
వేరు జాతులుగాని తెలిసిన మహానుభావులు మాత్రము ఏకంబనే ఎంచు
దురు వింటివా.

శం—వ॥గురువర్యామీవాక్యంబులు ఎన్నినామదికెంతోస తోషంబా
యెను సరి ఏనిప్పుడే పుష్కరంబునకుంజని వాణీశుని గూర్చితపంబుంజేసి
మోక్షంబుసంపా ంచుకునియెద సెలవొసంగుడు.

బై—వ॥ శంఖచూడ నీవు పిన్నవాడవు నీకా యత్నమెందుకు ఇంకా
నావద్దకొన్ని విద్యలనభ్యసించుము.

శం—వ॥ ఆర్యా ఇ తవరకు తమవద్ద నేర్చిన విద్యనాకంతియే చాలును
కృపజేసి సెలవొసంగుడు.

బై—వ॥ సరి శుభంబౌను గాని నీజననీజనకు లాశీర్వాదము పొంది
పొమ్ము నీకిదియే సెలవు. (అని నిష్క్రమించిన)

సం—వ॥ శంఖచూడుండు స్వగృహంబునకు వచ్చుచున్న నచ్చట
ధవళ.

ధవ-వ॥ (తనలో) ఏమీ మత్కుమారుండు పాఠశాలకుంజని ఇంత వరకైరాడా యెనుగద (అని శంఖచూడుడువచ్చి)

శం-వ॥ అమ్మానీకిదో నమస్కరింపుచున్నవాడను కటాక్షించి నామనవి యాలించుము.

ధవ-వ॥ కుమార వర్ధిల్లుముగాని అట్టి మనవి ఎట్టిదో వచింపుము.

వాదం - ఆదితాళం - తరుజ (వినవే జననీ గనముద)

శం॥ అమ్మా నాకాజ్ఞ వ్వవె పుష్కర । యాత్రలు సేవించగ బోదుగ॥
అ॥ ఇమ్మహి నాతోటి బాలురతోజని । యింతలోన తిరిగి వచ్చెదగ॥

వ॥ జననీ నాతోటి బాలులందరు పుష్కర తీర్థము బోవుచున్న వారలు కావున వారితో నేను పోయివచ్చెదనే.

ధవ॥ తనయా వినుపుష్కరంబు చాల । ధూరముంది నడువజాలవు ॥తన॥
అనువుగ నిన్నా యాత్రకు బంపగ । మనుసొప్పదు మానియుండరా ॥

వ॥ కుమార పుష్కరంబు చాల దూరమున్నది కావున నీవంత దూరము నడువజాలవు నామాటనమ్మి యూరకొనుము.

శం॥ చాలదూరంబు యున్నయదో యా । బాలురెట్లు బోవుచున్నరే ॥
చా॥ సేలుగాను నాతోను దెల్పకా । జోలిమానుమని బొంకుచుంటి ॥పిక॥చాల॥

వ॥ అమ్మా ఏదో ఒకమాట జెప్పినన్ను భయపెట్టింపుచుంటివి గాని మరేమిగాదు ఏనేట్లైన బోయెద చూడుము.

ధవ॥ ఎంతజెప్పిన వినక యున్నవదె । ఇంతమూర్ఖమథ మేలనురా ॥ఎంత॥
రంతుజేసి నీవు యాత్రకేగినను। పంతులు గొట్టునదెరుగవురా ॥ఎంత॥

వ॥తనయా నీవాపుష్కరంబునకు బోయితివేని అచార్యుండు నిన్ను కోదండ మెక్కించి కొట్టును నామాట నమ్ముము.

శం॥ హరిదర్శనమును గోరిన వారిని । ఆచార్యుండెందుకు గొట్టున్ ॥హరి॥
హరి దర్శనమును గోరక గురునకు । నపచారము జేసిన గొట్టున్ ॥

వ॥ కావున గురునకు ఏమైన నపచారము జేసిన గొటునుగాని హరిని సేవించువారిని ఆతండేమనడు వింటివా తల్లీ.

ధవ॥ బాల నీమృదు పల్కులు విన్నను । చాలగ మది సంతసమాయెగ ॥
బా॥ వాలాయము అంబారిప్యాట శ్రీ । లోలుడేలు మరువక నిన్నుగ ॥

వ॥ ఆహాహా తనయా నీసుగుణంబు లింతని చెప్పరాదు సరి మీా గురువులవారి యాజ్ఞ గొని పొమ్మా నీకిదియే సెలవు.

శం-వ॥ అమ్మా ఆచార్యుల సెలవు ఇంతకు మున్నె గొనివచ్చితి దే నేబోవుచున్నవాడను.

సం-వ॥ అని నమస్కరించినంతలో పరుద వాలును.

—(సతీతులసీ చెలులతో ప్రవేశం - దర్వు)—

తుల॥ ధరిత్రి ధర్మధ్వజాయాఖ్యునకు । వరకుమారైనే భామినీ ॥ధరి॥ మరిక్ నాదు నామముల్ తులసియని। ధరందు బాగిడెదే కామినీ ॥ ధరి॥ సతీమణుల మించిన శృంగారిని । క్షితందునా సరెవ్వారిలా నీతి వంతురాలనయ్యెనే ప్రి । ఖ్యాతివహించిన సతినిలా ॥ధరి॥ మరిక్ వేదశాస్త్రముల్ జదివినే । పురాణముల్ పఠియించితీ । సరోజా క్షుల సత్యంబులగని । పరోపకారము జేసితీ ।ధరి॥ దివరాత్రులు దేవ దేవుని । బ్రోవుమనుచు స్తుతీయించితీ నవాయస్వానాంగినయ్యె ప్రాణ నాథునీకై వెతకితీ ॥ధరి॥ అశావేణులంగూడి పూలా । వన మునకు యేతెంచెదా । ఫలించగను అంబారిప్యాట శ్రీ । నలిన సంభవునీ దలచెదా ॥ధరి॥

వ॥ సఖ చంద్రముఖ యొక సమాచారము.

సు-వ॥ అమ్మా తులసి అది యెట్టి సమాచారమో వేగంబున వినంజేయుము.

—(వాదం - ఏకతాళం - తరుజు నందనందనుజూడ)—

తుల॥ కన్నియరో నామవవి నీకు । విన్నవించెద వినుమికా ॥కన్ని॥ పన్నుగా నాజనకునితో ముని। మున్నుదెల్పిన దీయికా ॥కన్ని॥

సీ॥ సఖయరో నొకనాడు సయ్యన నారదుడు । మాయింటికివచ్చి నన్ను గాంచి । ఈ బాలికెవరనీ నాజనకు నడిగినా । నాపుత్రికారత్న మని యుదెల్ప । నామాటవినియు తానడిగెను నీసుతకు । శుభలగ్న మును జేసినా వటన్న । నాపుత్రికకు తగు నయగుణాఢ్యుని ఏను। వెతకుచుంటిని యెక్కడున్నడనగ ॥గీ॥ నారదుడు దెల్పెమున్ను లోకమునను । యలసుధాముడా రాధ శాపమొంది । శంఖచూడుడై జన్మించె జగతిలోన । యతడె నీపుత్రికా భర్త యనియు పల్కె

వ॥ కావున యుద్ధానవేంద్రునకు దప్ప ఇంకెవ్వరికినీ పుత్రికనివ్వ దలంచకని నారదుడు నాజనకునితో చెప్పి పోయెను అందుల కిప్పుడా సుందరాంగుడెందున్నవాడో కదా నీకేమైన దెలిసియున్న నాతో దాచక దెల్పుము సఖీ.

సు॥ సుందరీమణి యట్టి పురుషు । డెందున్నది ఎరుగను ॥సుం॥ ముందుగా
నీజనకునడిగిన । ముదిత నీకును దెలుసును ॥సుంద॥

వ॥ అమ్మా అట్టి వీరపురుషుండెచ్చట యున్నవాడో యేనెరుంగనైతిని కావున మీ నాయనగారిని యడిగి తెలుసుకొనుము.

తుల॥ అతని కొరకే నాయన జనకుడు । వెతుకుచున్నాడు గానికా ॥అత॥ నీతి
వంతుని జాడదొరకక । భీతిపడుచున్నాడికా ॥అత॥

సీ॥ అతనికొరకె జనకుడన్ని దేశములకు । పత్రంబులను వ్రాసి పంపెగాన।
ఏదేశమునుంచి యేసంగతియు రాక । చింతజేయుచునుండె యింత
వరకె । అట్టి పురుషునిజూడ నెట్టుల దెల్యునో । చెలియరో యేనింక
శంఖచూడ । దానవేంద్రునకునే దాస్యంబుజేయునీ । జన్మమేల యెన్ని
జన్మములకు ॥గీ॥ ముందటి జన్మమునన్ను పొందునట్టి । నాథునీ
నామ సన్నిధికి నందముగను । దెచ్చువారికీనే బహు హెచ్చుగాను ।
రత్నభూషణంబులనిత్తు రమణి వినుమా ॥

వ॥ చెలి వింటివా ముందటి జన్మంబున మేమిరువురము దంపతుల మని నారదుండు దెల్పెను కావున అట్టి వీరపురుషుని జాడలు దెల్పువారు మనపురంబున ఎవరైన గలరేమొ యోచించి తెల్పుము సఖీ వారేమి గోరి ననది ఏను తప్పక నిచ్చెదాన.

సు॥ చిత్రమే నీవాక్యములు విన । ధాత్రి తులసీ నాకికా ॥చిత్ర॥ సత్రముల
అంబారిప్యాట । శౌరి మెచ్చును నిన్నికా ॥చిత్ర॥

కం॥ తానెవ్వరో సుతులెవ్వరో । నానాబాంధవులు వృజ్జనంబులు యెవరో।
లోనరయుగ నెవ్వరికిన్ । గానగు సర్వులు గాంత్రి కర్మఫలములన్ ॥

వ॥ అనునట్లు నీపూర్వపుణ్య విశేషంబువలన నీపతిని దెలుసుకుంటివి ఆహా నీవంటి పుణ్యాత్మురాలీ లోకంబునంగలదా తల్లీ అట్టైన ఎరుకలసాని సర్వంబుందెల్పునని పెద్దలు జెప్పగా వినియుంటిని కావున ఇప్పుడే ఎరుకలసాన్ని బిలిపించి ఎరుకడిగి తెలుసుకుందమా తల్లీ.

తుల-వ॥ అహాహా సఖీ నీయాలోచన ఇంతని చెప్పరాదు సరి అట్ల ఎరుకలసానిని వేగంబు నిచ్చోటికి రప్పించుము.

సు-వ॥ సరి మంచిదట్టులనే రప్పించెదగాని అనుష్టానంబునకు వేళైన అంతఃపురంబునకుంజని అన్నము భుజించి వత్తము రమ్ము.

తు-వ॥ సరి మంచిది పదమ్ము (అని నిష్క్రమింతురు)

-(ఎరుకల ముత్తిగాని ప్రవేశం - దర్వు - ఏకతాళం - ద్వైతేయుకు)-

ముత్తి॥ ఏమాయె లేయెమ్మో ముత్తి । ఇం । కెందాక పంటావె ॥యేమా
జామాయె పొద్దెక్కె । జంగళ్ కెల్లాలంటె సీమంతు బిడ్డోల
నమిడీ పంటా వింక ॥ఏమా॥

వ॥ ముత్తి వోముత్తి అంగో పొద్దెల్లా తెక్కిందోచూడు భాగతేను కుంట పండొగ్గె భళ్ళియేంపంజెయ్య కట్టింగపంటె కమ్ములకెట్లాత్తాది సొమ్మ సోమందాలెట్లు దొర్కుతాయె బోస్డిలేయెమ్మో.

సం-వ॥ అంతలో ముత్తి కండ్లుదుడుకుంటలేచిట్లనె.

ముత్తి॥ నమిడాని నంది డ్తవేమిరా । వోర్లల్లా ఱుకాపోడ ॥నమి॥ నామీద
నీసొమ్ము లేముమ్మయో చూపు । యేమిలేకున్నను ఎగుర్తా
వింతెత్తు ॥నమి॥

వ॥ ముత్తిగా వోర్ముత్తిగా నన్నెమొ పడొగ్గె భాగభళ్ళిందంటు న్నావు సొమ్ము సోమందా లెట్లు దొర్కుతాయని తిడుతున్నావు నీవేం సొమ్ములు జేపిచ్చిపెడ్తె నేనేంబెట్టుకోని ముత్తి యేందిని భర్తిర గుంజగ మాపటికి లేకున్న పోకడైతే పోనియ్యవ్ పా.

ముత్తి॥ పాపా యేమంటివి చెప్వ । నీ । యీపేమద్ది తిపుడు ॥పా॥ ధూపా
నీల్లాకంట రూపాలుంచుకుంటె । సేపోయిచ్చుకోని కోపండెప్పి
త్తావు ॥పా॥

వ॥ బోస్డీ నాసొమ్ము సొమందాల్ని మీదేంలేవులే నీముక్కున్న ముక్కుపోగెక్కడిది భద్రాన్ యెన్నిత్తె ని కట్టంజేసి కల్లునీల్లకంట రూపాలుంచుకుంటె నాకెరుకజెయ్యకనే సోపతోల్లకు సేపోయిచ్చుకొని చాటుకక త్తెచ్చుకొని బాగ తాక్కుంట తినుకుంట బల్సి నామీదికె మర్లబడ్తున్నావ అట్లనేమర్లబడ్తివంటె నాకోపంఅచ్చెనా మొత్తెయ్యానే మొత్తేత్త చూడు.

ముత్తి॥ అబ్బోయి మొగోడుజేత్తె । నేందొబ్బితిని బత్తి ॥అ॥ మబ్బున్నె
గొబ్బిశబ్బ । దబ్బావనందూకెల్లి గొబ్బేడు దాగిచ్చె । దెబ్బల్
గొడ్తాటాడు ॥అ॥

వ॥ అబ్బో ఈ గుంజన్న కట్టుజేసి పెడ్తనేం దొబ్బితిని బల్తున్న నట ఏనే గామంకెల్లున్న గల్లంతగూడ బోస్కొందెత్తె అవ్వన్నమ్ముకోని సత్తె గొబ్బాడు కల్తెచ్చుకోని తాక్కుంటున్న రూపాలన్ని పాడ్జేసి యింక సేపోయిచ్చుకో లేదాయని తిడ్తున్నడు ఈని రెక్కలిరిగి కుప్పబడ్డాయట ఈడు ముక్కుపోగు జేపిచ్చి పెడ్తె నేంబెట్టుకోని ముర్తున్నట అన్ని లంగ మాటలు గాని వొక్కమాటైన సక్కాక్ మాటకాదు ఈంతోటోడొర్తాడు ఊకున్నదే నయం.

ముత్తి॥ ఎక్కూవ మొహగాకె ముత్తి । నీకు । లెక్కజెప్పి మొత్తేత్త ॥
ఎక్కూ॥ మక్కూవతో మ్యాకలెంకట్రాజామయ్య । నిక్కా
ముగా మాటపద్దార్లిత్తే యెవ్వి ॥ఎక్కూ॥

వ॥ భద్రాస్ ఏనింతెల్లెమె మరచిపోయిననుకున్నావ అంబారిప్యాట మ్యాకల వెంకటరాజం నవుల్ల గుట్టకాడిసేను గొత్తంగ పొలముచ్చుకట్టి అడ్లుకుతె అండ్లకు పంచులలాటైతె అప్పిటను మొత్తేసి నాల్లకు ఇనామిత్తనంటె అప్పిటను ఏను బాత్తిగనే మొత్తేస్కచ్చిత్తె అతడు మాట పదారు రూపాలియ్యలేదా అబ్బ గన్ని రూపాలుండంగ సుగనీ గల్లమ్ముకోని కల్తాగినాక బోస్డీ అండ్లకెల్లిమాత్రం అగుసుల గంగారాం ముక్కుపోగుజేసిచ్చినందుకు మూప్పయిరూపాలిచ్చేత్తి ఇంకెక్కున్న రూపాలెవ్వి నీకెక్కైన మత్తిబాగచ్చింది నీమత్తం చేత్తమాడు. (అని కొట్టును)

ముత్తి॥ చక్కాని అంబారిప్యాట । యూ సామేసాకున్నాఅ్రి ॥చక్కా॥
యెక్కున్న రూపాలు యేనేదిన్నట్టుంటె । కుక్కలకొడుకా నీకు
లెక్కల్ జెప్పతాగు ॥చక్కా॥

వ॥ ఆయెక్కున్న రూపాలేంజేసినావంటె నిత్తెగొబ్బెడు కల్తెచ్చుకోంతాగుతె అంజటి రాజగానికి ఆరువైరూపాలిచ్చేత్తి అండకెల్లో పది రూపాల గొంగడేదెచ్చుకుంటివి యిగ పద్రాఁరూపా లుండంగ నీ బొంద మీదనేబెట్టుకుంటివి యిండ్ల నేనేమన్న దిన్నట్టున్నాదిర చెప్పవేమిర కుక్కలకొడుక నీగుడిసిలేం గతుందిర తిందారంటాక్కిత్తు గతుందాకట్టు

కుందారంటో బట్టగతుందా తమా కట్టుకున బట్టలేకుండంగ ఆ మ్యాక లీకవ్యాక మ్పు చల్లకూడ ఆనేకనో బట్టరెండు రైకెలి త్తె అటితోటి ద్వారా కెల్లదీ త్తి నీమొకానికొక్క బట్టన్న కట్ట వినావుర చెప్పవేమిర

—(వాదం - ఏకతాళం)—

ము త్తి॥ ము త్తియేమంటావు। మూన్నెల్లకిందాట బొ త్తింగలేవాని బోస్డీ
నన్నాడిత్తె ॥ము॥ యెత్తెన రెండు గుమ్మిబొ త్తలిచ్చిము మ్యాక।
వెంకటా (జంవద్ద కొ త్తకోక లె త్తి ॥ము॥

వ॥ ఎందే నంజ తిందారం టొక్కెత్తులేదు కట్టుకుంవారంటె బట్టలే వంటున్నావ మూన్నెల్లనాడు అదే మ్యాకల వెంకటరాజంకు రెండు గుమ్మలల్లిత్తె అవేను కట్టుపాకె రెండు మంచి చీరెల్నేసియ్యాలే అవ్వోం జేసినావు అమ్ముకోని కల్లాగినావె బోస్డీ.

ము త్తి॥ ఉత్తు త్త మాటాలు ఊకేంటొక్కడ్రావుర। సత్తెంగ మాట్లాడె
సాని మెచ్చుతాడు ॥ఉ॥ కొ త్తకోకత్తెచ్చి నాకేయిచ్చినాని
ము త్తిగ గీలం చెసీ నె త్తిమీదబెట్టుకొర ॥ఉ॥

వ॥ ము త్తిగా వోర్ము త్తిగ నీవు నాకేం మొగడవు దాపరమొతిచిర ఆ మ్యాకల వెంకట్రాజం దగ్గర దెచ్చిన చీరెలు నాకేఇచ్చినానని గీలంచె నె త్తిమీద బెట్టుకోర నీతల పండుబగుల ఉలంగమాటలు ఎందుకు మాట్లాడ్తావుర ఆ రెండు కోకత్తెచ్చుకోని దీలెకందుకుక్క మీఇద్దరి అక్కలకు కట్నంబెట్టలేవుర చెప్పవేమిర మొద్దోగ్లె నిలబడితివి.

ము త్తి॥ అదంతట్లుండానీయ్యే అదిలేకన్నాను। ఆకలైతుంది గింతండెమ్యో
తిని పోత ॥అద॥ యేదెచ్చినాగాని యెవల్లేమిచ్చినగాని। కాదనక
నీకిత్తు బాదల్ పెట్టకె నన్ను ॥అద॥

వ॥ ము త్తి వోము త్తి ఇగోనె నాదిలేకన్నాను ఇప్పటినుండి నిన్ను గింతమాటైన అన యేనెద్దెచ్చిన గానీకే ఇత్తాను యింటికి పెద్దకా మూంఘరాల్ను జేత్తాను నాపై కోపంజెయక గింతండెమ్యోతిని జుగ ల్కొల్తా

ము త్తి॥ బుద్ధిమంతుడవాని యిద్దర్నిడ్చిపెట్టి। అద్దెకొంపను వచ్చి ముద్దంగ
నింజూ త్తె ॥బు॥ ఎద్దేన్ను పోతోలె ఏమ్మెక్కి। మొద్దోగ్లె బల్చి
నన్ సద్దుల్ సుద్దూతావ ॥బు॥

వ॥ మంచోడవె పోనిస్లిట్టాగనే ముత్తైత్తావు నిన్నే మన్నాను గాబాలక్ష్మి మొగడొక్క మాటైనంటాడ అతడు పెళ్లామ్ము పతకింపతుక మోర్గె జూచుకుంటాడు యిగ అందరు నీతీరుంగుంటె రుత్తరు త్తనేపా ఇంట్లేమున్నాద నండుమంటున్నావు అరొచ్చేడంత గట్కొండంట అయిల్లండు తెలీవొక్కండవే తింటివి పోరగాళ్లు నేనట్టింగుపాసమె పంటెమి యింట్లేమి లేకున్నగాని అండుమని అడ్డాన్నా డిత్తె అడ్డక్కడికెల్లి దెచ్చింకుతది పొద్దునీ రసరస పొద్దికా రసరస ఈ రిసరస్సేగియ్యలేను యీాయింట్లుండ లేను ఇక మావోల్లింటకెల్లేత్త చూడు.

ముత్తి-వ॥ (తనలో) అబ్బో అందుకే అంటారే కొబు యెంత సీమంతొత్తైన ఎంత దండొత్తైన పేమగల్ల పెండ్లాలు జెప్పినట్లల్లాగల్లో వుంటారు ఆడ్డగల్గి కూకుంటె మొగోని మడెండిత్తాడన్న మాటే సరి మంచిది దీన్ని కొంచమ్ కొంచము చుచ్చుకొట్టి మాటాడిచ్చి మనసు గరిగిత్త గాక.

ముత్తి॥ యిద్దరాల్లొగల్లగడ మద్దములో నీడాని । పెద్దొల్ల సంగాను
శెల్లామ వినలేదె ॥యి॥ గుద్ధుకునోల్లల్లాలేర సూస్తానోల్లల్లలేర ।
పొద్దూకంగనే ముద్దు గల్చినోల్లల్లాలేర ॥యి॥

వ॥ ముత్తి నాముద్దులముత్తి సన్నేమన్నానని అల్గినావె అబ్బొగా రెండుదెబ్బల్ గిట్లగిట్ల కొట్నందుకె గింతల్గుతున్నావె ఆలొన్నగలు అనుకునోల్లేర పొద్దూకంగనే ముద్దుంగల్చినోల్లేర ఆలొమ్మగల కొట్లాట అద్దముల నీడకాదె ఇప్పటినుండి నిన్ను గింత మాటైన అన అమ్మతోడక్క తోడ్దే వుంతోన్నితో న్నాతోడు యిగనన్న నామాటనమ్మి గింతండెయ్యి ఆకలైతుంది ఇంగో నాకడ్పెంత లోతుకు పోయిందో చూడు.

ము-వ॥ (తనలో) తాత కొడుకు గిప్పుడ రోగమైత్తందరిగింది ఆడుదానన్న మొగోనికిప్పటి సుఖమా అప్పటి సుఖమా రెండు సున్నె ఇంటి యిల్లాలుకూడండ కల్గికూకుంటె మొగోడు కిందికి మీదికి తాయి మాయాడడేంగా ఇప్పుడీనితో మాట్లాడకుంటేడ్తాడు మాట్లాడిత్తగాక (అని ముత్తిగాన్ని జూచి)

ముత్తి॥ మేటి శ్రీ) అంబారిప్యాట హారిసాక్షినీ । మాటనెగింత్తైన మరికాద
నన్నాన ॥మే॥ చీటి శ్రీ) సుశ్శీల దొరసానింటికెల్లి । పూటాకు
బతిమాలి బువ్వడక్కత్తానమ్మ ॥మే॥

వ॥ యేనెన్నడైన నీమాట గింతకాదానన్నానా యెన్ని తైఁ కతె గామంకెల్లి గంజి గడ్క బుఁ అక్కచ్చి పెట్టాఁగ సుగనన్నింక మొత్తే త్తాపు నిత్తెని త్తెట్లనే మెు తేత్తె నీమొఁకమెట్లు చూడాలె మల్లి నీకెల్లు కట్టుజేసి పెట్టాలె ఇఁగో యిప్పటి దెబ్బలకు నా యీపెట్ల పొఁగిందో చూడు.

ము త్తి-వ॥ పోనె ఇచ్చేటిసుంది నిన్నేమననుగాని ఇప్పుడెక్కడి కెల్లో గట్కనో బువ్వనో అడక్క త్తటిపి బేగి అక్కక్కరాపోయె తినిజంగలెక్కత్తా అంగో సోపతోల్లోక్కల్లేరు చూడు.

ము-వ॥ ఇంకెక్కడికెల్లి మక్కీల దొరుసానింటి కెత్తెనే ఇంత దొర్కు తాది అడక్క త్తతియ్.

ము త్తి-వ॥ అక్కరా గాని నిన్నొందుకో తులసి దొరుసాని రమ్మన్నదట ఆడ్డాక పోయి అదేంటో ఆర్సుకోంద్రా. జానే అట్లనే గోంచల్లడక్క రాయె.

ము-వ॥ మంచి దట్లనే అడక్క త్తగాని నేనచ్చుఁందాక గీవాకంచల్లు.

ము త్తి-వ॥ ఒక్కటిగాదు రెండల్లేత్త పోయె.

సం-వ॥ అని నిష్క్రమించిన తులసి సుగందినిగని ఇట్లనే.

తుల-వ॥ సుగంధీ ఎరుకలసాని వచ్చెనా లేదా.

సం-వ॥ అంతలో ము త్తి లోపలనుండి ఎరుకల కీకవేయుట.

ము-వ॥ ఎరుకో యవ్వ యెరుకా యెరుకక్కవ్వ యెరుకా.

సం-వ॥ అని యెరుకల కీక వేసిన సుగంది తులసినిగాంచి.

సు-వ॥ అమ్మా తులసి అదో ఎరుకలసాని రానేవచ్చుచున్నది కనుంగొనుము.

సం-వ॥ అంతలో ము త్తి వచ్చి తులసినిగని.

ము వ॥ దొరుసానీ దండాల్ దండాలు నన్నొందుకో రమ్మన్నరట అదేంటో చెప్పెయ్.

తుల-వ॥ చెప్తానుగాని నీపేరేమందురు..

ము-వ॥ నా పేరు ము త్తియని పిలుత్తురు.

తుల-వ॥ ము త్తీ నామనస్సునగల మాటచెప్పగలవా.

ము-వ॥ దొరుసాని అంత చెప్పెస్తాను మొదలైతె చేటలో బహు దానముంచుకరమ్మ యేను దేవతల సుతించుకుంట.

తుల-వ॥ సుగంధీ ఈ యెరుకలసాని దేవతలను స్తుతించునట పైడి మొంటెలో కొన్ని ముత్యాలు వరహాలుంచుక వచ్చి యీముత్తి కొసంగుము.

సు-వ॥ చిత్తము తల్లీ అట్లులనే ఉంచుకవచ్చివ్వగలను.

సం-వ॥ అని మొంటెలో ముత్యాలుంచుకవచ్చి ముత్తికిచ్చిన.

( ముత్తి తనలో )

ము-సీ॥ శ్రీలక్ష్మినాథునీ సేవించి పూజింతు । శారధనాథునీ సన్నుతింతు । పార్వతీ నాథునీ ప్రేమతో పూజింతు । యెముడాల రాజన్న నెపుడు గొలతు । కాశి విశ్వేశ్వరుని కాంచతో నేదలతు । తిరుపతి వెంకటేశ్వరుల గొల్తు । సిద్ధిరాముల యేను ముద్దుంగ పూజింతు । దుబ్బరాజేశ్వరుని దలతు ఎదిలో । నల్లగొండ నాంపెల్లి నర్సిములు దలతు । కొండగట్టనుమండ్ల కోరికొలతు । ఆరెల్లి మల్లన్న నాత్మలోనం దల్తు । కొమిరెల్లి మల్లన్న । కోరి కొలతు । సావిత్రి గాయిత్రి సతిదేవినిం దల్తు । పరదేవతా నిన్ను ప్రస్తుతింతు । మాలక్ష్మి మాంకాళి మమ్మదేవినిందల్తు । సార్గమ్మా నన్ను సన్నుతింతు । పోశమ్మ కాశమ్మ పోతలింగని దల్తు । ముత్యాల పోసును ముందుగొలతు । చినగంగ పెదగంగ చిల్కల్చిన్నును గొల్తు । కట్టమైసును చేపట్టి కొలతు॥ గీ॥ ఎల్లకాలము నాబుట్టి యేలెతల్లి । యెల్లుమాంబరో నిందల్తు యెపుడునాకు । కావలసినా వాక్యముల్ కాంక్షతోను । ఇచ్చిబ్రోవుమీ ఈదీను రాలి నెపుడు ॥

వ॥ దొరుసాని ఇగ యెర్కద్దురా చెప్తాను.

సం-వ॥ అంతలో తులసివచ్చిన పైడికోల చేతికిచ్చి ముత్తిట్లనె.

ఎరుకలపదం

ముత్తి॥ చక్కన్ని దొరుసాని । నిక్కముగ చెప్తాను । మక్కువతోయిటు విను । ఇంతల్నే పెండ్లిపేరంటాలు విందులు । అయితాయ కావాయని । అడ్గుతున్నవుగాదె ॥ ఇంక మూన్నెల్లాకు । పంకజాక్షిరో నీకు । తప్పక పెండ్లీలు । ఒప్పతో నగుతాయి । చింత

జేయగరాదు । చిన్నబోనగరాదు । నామాట కాదనక । నాగ్గింత గక్కొమ్యె । ఆకలైతున్నాది । అందాల దొరసాని ॥

తుల-వ॥ ముత్తీనీవు చెల్పువాక్యంబులు నాకొకటైన అర్థమగుటలేదే.

సం-వ॥ అంతలో ముత్తి.

ముత్తి-పదం॥ ఇంకెట్లు జెప్పాలె దొరసాని । గిసవంటివాని కొరకు అడ్గుతున్నావు గాదే । మరియు అట్టిపురుషుండు । గామాల్లున్నాడ । గడీలల్లున్నడ । పట్నాలల్లున్నడ పల్లెలల్లున్నడ । సందుల్లున్నడ । గొందుల్లున్నడ । ఆడున్నడా । అంతల్లున్నడాయని అడ్గుతున్నవు గాదె । అట్టిపురుషునిజాడ । గట్టిగ జెప్తీను ॥ గిసవొంటివాని వద్ద । గూర్చుండియున్నాడె । చంచమామాకన్న । చక్కదన మున్నాడె । ఈడైనావాడు । జోడైనావాడు । అందచందమూలాకు । ఆస్పదమైనవాడు । నగుమోముగలవాడు । యోగుల పూజించువాడు.

వ॥ తప్పక నిన్నే పెండ్లాడుతాడు ఆకలైతుంది గింత గంజి బొయ్యే దొరసానీ.

తుల-వ॥ ముత్తీ అట్టి గంజిబోసిన నేమి ఫలము నీకు మంచి పక్వాన్నంబులతో భుజింపబెట్టెదగానీ యింకొకమాట అడిగెద ఆగుము.

సం-వ॥ అని తులసి ముత్తిచేతులోవున్న వేల్పుకు మొక్కినంత.

ముత్తి-పదం॥ అట్టి పురుషుండు । ఇక్కడికేవస్తాడ । లేక అక్కన్నే వుంటాడా యని । యడ్గుతున్నావుగాదె । అట్టి ధనుజుండు । ఇక్కడికి రాడుగాని । నేనొక్కమాట జెప్తానే । భధరీ వనమందు । సుధతీ మణినీవు । హారుని గూర్చితపము । హాతివరో జేస్తివేని । అట్టి పురుషుడు వేగ । ఇక్కడికే వస్తాడు । వనమందు మీపెండ్లి । వనమాలియు జేసు । అవద్ధము జెప్పబోను । ఆడి తప్పబోను । యింతకన్న మిన్న । యుపాయమే లేదే । నాకొక్క పాతబట్టిత్తే । నిన్నింతో యాజేత్త ॥

వ॥ తల్లీ తులసీ దొరసాని ఇగనన్నా నామాట నమ్మి నాకొక నీపాత బట్ట జూచియ్యుము నిన్నెల్లకాలము యాజేత్తాను నీముత్తైతనము చల్లంగుండనని మొక్కుతున్నాను,

తుల-వ॥ సుగంధీ ఈముత్తికి అన్నము బెట్టి నాయొక్క పట్టు పుట్టంబుల చీర రెండు రవికెలు దెచ్చి యివ్వుము.

సు-వ॥ చిత్తము తల్లీ అట్లులనే ఇచ్చెదను (అంత ముత్తిసిగని) ముత్తీ ఇదో చీర రవికెల గైకొనుము.

ము-వ॥ దొరుసాని ఇగెల్లేత్తున్నద యుంచుడు.

తు-వ॥ మంచిది పోయిరమ్మా (అని సుగందిని జూచిట్లనె) సుగంధీ ఎరుకల ముత్తి జెప్పిన వాక్యంబులెల్ల వింటివిగద కావున మనమిప్పుడే బధరీ వనంబునకుం బోవుదము పదుండు.

సు-వ॥ సరి మంచిది అట్లులనే బధరీవనంబునకు పోవుదముగాని నిజనకునాజ్ఞగొని వచ్చితివా తల్లీ.

తు-వ॥ సుగంధి తొందరెందుకు ఇంతకుమున్నే మానాన్నగారిచే సెలవు పొందివచ్చితిని త్వరగా పోవుదము రమ్మా.

సు-వ॥ చిత్తము తల్లీ అట్టులనే వచ్చుచున్నవారము పమ్మా (అని భదరీ వనంబునకు సఖులతో నరుదెంచును)

---

# తృతీయాశ్వాసము

తు-వ॥ అహాహా సఖీమణీ ఇట్టి భధరీ వనంబెంత శృంగారమున్నదో చూచితివా.

సు-వ॥ తల్లీ తులసి భధరీవనంబిదియేనా ఆహా ఎంత శృంగారమున్నది ఇట్టి వనంబును వర్ణించ నలవిగాక యున్నదిగద.

మిత్రివేరె - దర్వు - ఏకతాళం (తెరజు ఆహాయీవనంబుగన)

తుల॥ ఆహా...యీవనంబునంగల । వసంత సుమములు । కనుంగొనగ ముదమౌగా ॥ఆహా॥ మల్లెలు మొల్లెలు మందారకములు । విరభూసినవీ పొన్నలు బొగడలు । కల్లగాదు యీచల్లని గాలికి । జల్లుమనియె నాయుల్లములో ॥ఆహా॥ కోకిలములా కోకోయని గూసే । ఆకసమునకును హంసలు ఎగసే । పొకటముగ ఈపక్షి మృగాదులు । ఏకంబై బహు నాట్యమాడె ॥ఆహా॥ వాలాయము

అంబారిప్యాట శ్రీ । పాలలోచనుని ప్రస్తుతించియును । సేలుగ యీావన వృక్షము మొదటను । అలవేణులు బంతులాడుదమ ॥

వ॥ సఖీ ఇంక ఇవ్వనంబంతయు సంచరింపుచు ఫలసుమవృక్షంబుల పరీక్షింతమా,

ను-వ॥ అమ్మా సుమవృక్షంబుల వీక్షింతముగానీ అదా మధుర మైన ఫలవృక్షంబుల జూడుము.

వాదం - యేకతాళం (తెరుజు - పువ్వులు గోయుదమా చె)

తుల॥ యింతీ యీాతరువులగనరగ । సంతోషంబాయెను వేలగ ॥యిం॥
మంతనమున యీావృక్షములా । మరి మెచ్చటగన ద్రాక్షలిలా ।
యింతులు ఇాతలో । యెంతని బొగడుదు ॥యింత॥

సీ॥ ఏలమాపులు నిమ్మ లీతచిట్టీతలు । యెలకి ఫలవృక్షముల వెలదిచూడు । ధానిమ్మ గజనిమ్మ ద్రాక్షఫలతర్వులు । పోకల వృక్షముల పొలతి చూడు । గంగ నేరల్లును కర్జూర తెరువులు । కలము మామిండ్లదో కాంతచూడు । జామవృక్షములు శ్రీరామ చూతాతరల్ । సీతఫల వృక్షముల చెలియచూడు॥ గీ॥ తియ్యమామిడీ రసదాడి తేనెయరటి । మద్దిమారెడు యుదొరాస మేడితరులు । తాటిమాకులు చీకటి తరులు మట్టి । కొబ్బెరా మాకులనుగానీ యీాడతెరమే ॥

వ॥ తరుణి చూచితివా ఇవ్వన వినోదఫలవృక్షంబుల వర్ణించనలినాస నునకైన నలవిగాక యున్నది కల్లగాదు కనుంగొనుము,

సుగ॥ చిత్రిమె యీాతరువుల యెన్నగ । ధాత్రి తులసి నేడునుగన్నగ ॥
చి॥ ప్రతీ పుష్పంబుల ధలముల్ । పారిజాత మందారకముల్ ।
చిత్రవిచిత్రము సుమముల గనుమిక ॥చి॥

గీ॥ పుష్పితా శోకములు మల్లె పొదలుజాది ♦ తోపులును బండి గుర్వి వింద తోపులేవు ♦ మీాఱు బంగారు తామర ల్మేల్మిరంగు ♦ రంగు లొల్పెడు కలువలుగల సరసులు ॥

వ॥ తల్లీ తులసి పత్రివిచిత్రమైన సుమంబుల నామాంకితముల దెల్యనైతిని అదో వాటినువాసన ఎంత అందంబుగ వీచుచున్నదో చూడుము.

తుల॥ మల్లెపువ్వులను గోయుదమా । అల్లిబిల్లి జెడలల్లుదమా ॥మల్లె॥
కల్లగాదు కనుగొనుడికను । చల్లనిగాలికి నేడికను । ఫుల్లాబ్జాక్షి
తరులెల్ల జూపుదిక ॥మల్లె॥

సీ॥ మల్లెలు మొల్లెలు మంకెన తర్వులు । పారిజాతములివి పడతి వినుమా ।
పొన్నలు సురపొన్న బొగడలు రుద్రాక్ష । సంపంగి పువ్వులివి । సఖియ
వినుమా । కొండలు గోగులు గోరంట తర్వులివి । చెంగల్వ పువ్వు
లివి చెలియ వినుమా । గన్నేర్లు రెంజల్లు గులాభి తామరల్ । మందార
కములివి మరువ వినుమా॥ గీ॥ పంజాజి పూబంతులివి । యింతి
వినుమ సటికె సామ్రాజ్య పుష్పముల సఖియ నేడు । హెచ్చుగా దోపి
జడలల్ల పేక్షదీర । శిఖలో ధరియింతమా చెలీ । సాపు మెరయా ॥

వ॥ నెచ్చెలి వింటివా ఇట్టి పుష్పంబులెల్ల మచ్చికతో దోపి
హెచ్చుగా జడలల్లుకొని దీక్షతో అపేక్ష దీరగా శిఖలో ధరింతమా సఖి.

సుగ॥ అదుగదుగో హంసల కదుపుల్ । ముదమాయెను కనుగొన
వలపుల్ ॥అ॥ పొదలచాటు జేసియు మనము । కదులకుంట జని
యిక వినుము । అధురక జమరక । కుదురుగ బడుదము ॥అదు॥

వ॥ అమ్మా అట్టులనే ధరింతముగాని అదో రాజహంసలు ఎంత
అందంబుగ నున్నవో చూడుము కావున మన మిప్పుడే వాటిని చిక్క-
బట్టుకొని మధనారుల మంధరము ముధంబున సాధనలు నేర్చుకుందమా
తల్లీ.

తుల॥ శుకపికములు బల్కగ నెంతో । వికసము జెందెను మనసెంతో ॥
శుక॥ మఖరాంకుని భారికియేను । వొక క్షణమును తాళగలేను ।
సఖియ ముఖియనా । సఖునింజూపవె ॥శుక॥

వ॥ కావున అట్టి కోకిల స్వరంబులు విన్నంతమాత్రంబుననే
యామరుండు నాయురమ్మున శరముల దాల్చి నిల్చిన నామది విరహంబు
జెందుచున్నది ఇక యేనొక్క క్షణంబైన తాళలేను నారీరత్నమా నా
నాథుండిచ్చటి కెన్నడు వచ్చునోకదే.

సుగ॥ యెందుకె యీవిరహము నొందా । సుందరి తెలిపెద విను
బృందా ॥యెం॥ పొందుగ అంబారీపాటా । యిందిరేశ్వరుని
ఈపూటా । చె దనగంధిరో । సేవింతముయిక ॥యెందు॥

వ॥ తల్లీ తులసి నీవిట్లు విరహంబు నొంద పాడిగాదు నీవిచ్చట హరిని గూర్చి తపంబుం జేసిన అట్టి వీరపురుషుండిందు వచ్చి నిన్ను వరించ గలడు నామాట నమ్ముము.

తుల-వ॥ సఖీ నీవనుమాట నిక్కమె ఆయోగులసాని జెప్పినది మరచి వృథా యింతకాలము గడపితిని సరియే నిప్పుడే తపంబు ప్రారంభించెదను కావున పూజకు తగిన పరిమల పుష్పంబుల ఫలంబుల గొనిరాండు ఆలస్యంబు వలదు.

సు-వ॥ చిత్తము తల్లీ అట్టులనే దెచ్చువారము.

సం-వ॥ అని చెలులు నిమిష్కమించిన పరుదవార్లిలును పుష్కరంబున శంఖ చూడుడు బ్రహ్మను స్మరించుట.

దరువు - ఏకతాళం (తరుజు కమలనయనా)

శం॥ శారదాప్రియ స్వయంభూయిటు రారా వాణీశా । లోకేశా ॥శా॥ పరమ కృపాలయ ప్రజాపతి నిను । ప్రస్తుతించితిరా । లోకేశా ॥ శా॥ భక్తుడను నీపాలబడితిని । యుక్తిదెలుపుమిరా లోకేశా । శక్తిఫతివని నమ్మినినుగన । జేరవచ్చితిగా లోకేశా ॥శా॥ నేరమేమియు నేరనట్టి । నిరపరాధినిరా లోకేశా । కరుణ సాగర నీకు యింత । కఠినమేలనురా లోకేశా ॥శా॥ నీనేధాతవు నీవే నేతవు నీవేవిధాతవుగా లోకేశా । పావనా నీనామస్మరణా । పఠన జేసితిరా లోకేశా ॥శా॥ ధారుణి అంబారిప్యాట ధాముడవు నీవే లోకేశా । భారము నీదే యనంటిని । ధూరనాడకురా లోకేశా॥ శార॥

చ॥ కనికరమారయన్ వలదె । గాధిల భక్తుల సాకరాదె నీ
మనము దయామయంబిటుల । మాన్పెడేనలోకా తండ్రి యింక నై
నను ధానవుండని దలపు । నమ్మికతో నిను గొల్చుచున్న వా
రనిశము లెమ్మ రమ్మ రయ । మాదట గావగ వారలట విభూ ॥

వ॥ వాణీశా వారిజాసన వా దీనాలాపంబులాలకించి ప్రసన్నుండవై నాకోరిక నెరవేర్చుము దేవా మహానుభావా.

సం-వ॥ అంతలో బ్రహ్మ ప్రత్యక్షంబై.

బ్రహ్మ-వ॥ భక్తా శంఖచూడ ఏను వాణీశుండను కనువిప్పి కనుంగొనుము.

సం-వ॥ అంతలో శంఖచూడుడు బ్రిహ్మానుగని.

శం-వ॥ అహా దేవా కలిత సంభవ మీపాదంబులకిదో ప్రణమిల్లు చున్నవాడను కటాక్షించుడు.

బ్ర-వ॥ వత్సా శంఖచూడ వర్ధిల్లుముగాని నీకేమి వరంబుగావల యునో కోరుకొమ్ము.

శం. చ॥ అనిమిష దానవాహిమను । జాధిపులంధర నోడబుచ్చ జా
లిన బలవిక్రిమంబులు ద । లిర్పగ జేయుము సర్వశత్రు మా
దనునిగ ముజగంబులను । దక్కొని నేలగ జాలు వానిగా
ననుబొనరింపుమీ తగన । నంతకృపాజలధీ విధీయికన్ ॥

వ॥ దేవా నాకోరిక ఇంతియె వింటివా.

బ్రి-కం॥ కోరిన కోరిక లన్నియు ♦ భూరిగ ఫలియించు నీకు భోగములను
వి ♦ స్తారముగ నొందుదువు భళ్ ♦ గీరితినిన్ జెందగలవో గీ
దనుజ సుతా ॥

వ॥ ఇంకా నొక్క విశేషంబు జెప్పెద నాలకించి యట్లు సల్పుము.

శంక-వ॥ చిత్తము అట్టి విశేష మెట్టిదో వినంజేయుడు.

వాదం - ఆట. (తిరజు - తాతయ్యా మీదుయాజ్ఞ)

బ్రిహ్మ॥ శంఖచూడ తెలిపెద నది । చెవునబెట్టి వినుమికా ॥శం॥ జంకు
పడక భదరివనము । జేరుమి ఇంతలోనికా ॥శంఖ॥

కం॥ భధరీ వనముననొక తుక ♦ సుధతీమణి కన్నె తులసి సుందరి తప
సా ♦ ప్పదరిల్ప జేయు చున్నది ♦ ముదమున నీవిప్పుడందు
బోయి కనుమికన్ ॥

వ॥ కావున నీవిప్పుడే భదరీవనంబునకుంజని అట్టి సతీ తులసిని పాణి గ్రిహించాడి సుఖించుము.

శం॥ మంచిది మీారన్న మాట । మరువబోనుగానీ ॥మం॥ చెంచలలోచని
నన్ను వ । రించున యదిపూనీ ॥మంచి॥

గీ॥ వారిజాసనా మీాయాజ్ఞ విధమె యేను ♦ భధరి వనము నా
కిప్పుడు బోదుగాని ♦ నన్ను వరించునో లేదో యా నన్నుతాంగి ♦
జనకుడెవ్వడో తెల్పుడీ జయవిజయుపా ॥

వ॥ స్వామి నామె ఎవనికూతురనంబడును.

బ్రిహ్మ॥ విను ధర్మధ్వజ నృపునకు । కనకాంగి జనించె ॥వి॥ తనకు తగిన

భర్తకొఱకు । తపమును గ పంచె ॥వి॥

గీ॥ ఆవడచు విన్మ ధర్మధ్వజాఖ్యనృపారి ♦ నట్టి నృపుతనుజా రత్న
మన్ను మిన్న ♦ నిన్నుజూచి వరించును నన్నుతాంగి ♦ నీకు తగిన
మిటారియా నేర్పులాడి ॥

వ॥ కావున మున్ను నీ స్థితి నారదునిచే దెలుసుకొని నీవే భర్తవు
గావలయునని నాయొప్పాల కుప్ప తపంబుంజేయుచున్నది వింటివా.

శంక॥ సరె మంచిదట్టులైన । సంతోషమె గానీ ॥సరె॥ నారీమణి జనకుడు
నన్నే మనునో పూనీ ॥సరె॥

వ॥ దేవా నామెకు నాయం దిష్టమున్నను యా నారీ రత్నము
జననీ జనకు లిష్టపడుదురో లేదో యని అనుమానింపుచుంటిని:

బ్రహ్మ॥ జనకునాజ్ఞ మున్నె గొనియు । జేరెను యావనమును ॥జ॥ చను
మిక సత్వరముగ । చంధన గంధీ చెంతకు ॥జన॥

చ॥ చనుమిక సత్వరంబటకు ♦ చంధనగంధిని జెంది పెండ్లి జే
కొనుము నితాంత భోగముల ♦ కోమలితో సుఖియింపు మింపుమై
బెనుపుము ధర్మముల్ దిశల ♦ పెంపొనరింపుము కీర్తిచంద్రికల్
ధనుజులకెల్ల సంతసము ♦ దార్కొన జేయుమ జేయువిక్రమా ॥

వ॥ శంఖచూడ వింటివా నీవిప్పుడే భదరీ వనంబునకుంజని యాసుం
దరిని పెండ్లియాడి అమరావళి పాలింపుచు దానవులకెల్ల సంతోషము
గావించుము నీకిదియే సెలవు పొమ్ము.

శం॥ భదరీ వనమున కిప్పుడు । ముదమున జనుదెంతు ॥భ॥ పదపడి
అంబారిప్యాట । విధివని భజియింతు ॥భద॥

వ॥ స్వామి మీరుందెల్పిన విధంబే మెదులుదును గానీ నన్నా
శీర్వాదింపుడు.

బ్ర-కం॥ రత్నముః సుమి యకాంత ♦ రత్నము నీవైన బురుష రత్నంపు
సదా ♦ రత్నమునంజేకొనుమిక ♦ రత్నము రత్నంబు సరసరాజిల్మ
యోగం ॥

వ॥ దానవేంద్రా నీవు దలంచిన కార్యంబులన్ని శీఘ్రంబుగా నెర
వేరును ఇదో బ్రహ్మాస్త్రంబుం జేకొనుము. (అని శంఖ చూడునకు
బాణమిచ్చెను)

శం-వ॥ చిత్తము స్వామీ ఇదో నేబోవుచున్న వాడను.

సం-వ॥ అని శంఖచూడుండునిమిస్క్రమించిన పరుద ప్రాలును. భధరీ వనంబున తులసి హరిని స్తుతించుట

దర్వు - జల్వ,

తుల॥ మాధవ మధుసూధనా । నమో నమో నమో ॥ నమో నమో నమో । నమో నమో నమో ॥మా॥ కారుణ్యా సాగరా । కావవె నను భూవరా । వరదాయక వందితా నమో నమో నమో ॥న॥మా॥ పంకజాక్షు నేడికా । శంఖచూడు నీయికా । యంకమునకు బంపుమీా । నమో నమో నమో ॥న॥మా॥ నాపతినీ నాకికా । జూపకున్న నేడికా । వోపజాల శ్రీపతీ । నమో నమో నమో ॥న॥ మా॥ అంబారీ ప్యాట నీ । వాసుడవని యంటినీ । సంభరమున నాకుమీా నమో నమో నమో ॥నమో॥ మాధ॥
వ॥ శ్రీహరీ నాతపంబు మెచ్చి నానాథుని నాసన్నిధికిబంపి నన్నాధరింపజేయుము దేవా నన్నేలు దయామయుడ వీవుగావ.

సం-వ॥ అని ఇట్లు తులసి తపంబు జేయుచున్న శంఖచూడుండ భధరీ వనంబునకుంజని యవ్వన వినోదంబులగని.

శంక-వ॥ ఆహాహా ఈ భధరీ వనంబెన్న నలినాసనునకైన నలవిగాక యున్నది సిరి ఇట్టి వనంబును నామనుసార నొకనాకి వర్ణించెదగాక.

దర్వు - ఏకతాళం

శం॥ అహా యీా వనము । మహా విచిత్రము । యూహించి చూడ ఆనందము ॥అహా॥ నంధము । చంధము । గంధముల్ నేడు భళి ॥ అ॥ నంధము । చంధము । గంధముల్ నేడు భళి ॥అ॥ తియ్యని దానిమ్మలు । వెయిల కొలది తర్వులు ॥ ప్రియమైన యివి చూత ఫలములు ॥ ఫలములు । ధలములు । కలము మామిండ్లు అహా ॥ అహా॥ సింహముల్వ్యార్ఘాలముల్ । చిన్నచిన్న దుప్పులున్ । మహిలోన గల మన్ । భోతులున్ ॥ పోతులున్ క్రోతులున్ । వాతామృగంబులహా ॥ఆహా॥ అదుగో అడవి యేన్గులు । అంధమైన హంసలు । బెధురూచును పారిపోయెగా ॥ పోయెగా । పాయెగా । వేయూ ఘాణంబు ధగుల ॥అహా॥ అంబారివ్యాట శ్రీ । హారినీస్మరించె స్త్రీ । ఒలామ నీయీాదెవ్వతో ॥ యెవ్వతో నవ్వతో । పువ్వుబోణి గందునేడు ॥ఆహాయీా॥

వ॥ అహా ఈ సుందరాంగి యందంబేమని యందును.

దరువు - ఆదితాళం

శం॥ భళిరె యీసుందరాంగి యందము । భ్రమయు దీరదుగనకన్న మనము ॥భళి॥ యులుకు జెందె నామనంబు ఘనము । ఫలుకరించ బోధమన్న భయము ॥భ॥ చనులు బంగారు బొంగరములు । గనక నల్లాని కంధకములు ॥ దీనిబోలు నింతులెందు జాడలు । ఏనుజూడ లేను బోటికురులు ॥భళి॥ కలికికన్నులు మెరుపువిధము । వలపుక్షూ తగిన సన్న నడుము ॥ యులుకులావేణి కంఠస్వరము । యులను కోకీల పల్కు విధము ॥భ॥ వారిజాసనుండు దీని నొదుటా । వ్రాసి యుంచె నెట్లొ తాను మొదటా ॥ ధారుణీశ్రీ అంబారివ్వాట । ధామ నామొరాలించు తేట ॥భళి॥

సీ॥ ఇక్కల్కి నెమ్మోని చక్కదనం బెన్న । గారాదు పెక్కోండ్లు కష్ట పడిన । ఇచ్చెల్వ గట్టిన యీవల్వ లెంతయు । సింగార మొంది వాసికె జెలంగు । ఈభామ గైసేయు నింపగు సీపువ్వు । దామంబు లొసగు నెంతో ముదంబు । ఈరుచిరాంగితా। నేతపస్సును జేసి । కనినాడొ ధన్యుడీ గట్టులేడు॥ గీ॥ అందమంతయు నీసుందరాంగి యగుచు । నవని జన్మించె గాబోలు నద్ధిరయ్య । ఇది యనన్య సమాకారయిదియె ధన్య । ఇదియెసర్వాంగసుందరి యిదియెరమణి॥

వ॥ ఏమి ఈ కాంతలలామ సౌందర్యంబెన్న కమలాక్షున కైన కాంక్ష దీరకున్నది సరి ఏనిట్లు వృధా నాలోచింప నేమి ప్రయోజనము ఈసుంద రాంగి యెవ్వతో యడిగితెలుసుకొనియెదగాక.

పాదం - ఏక (తరజు జలజాక్షా నేబిల)

శం॥ హరిని స్మరించెటి । కురంగలోచని మీరెవ్వరే । చెలిసీ । పేరే మదే । చెలి॥ కారడవిలో యేకాంతముతోను । నారులతో జత గూడియు యికను । కరములు మోడ్చిన । కాంతలలామా । నీవెవ్వరే. ॥చెలిసీ॥ హరి॥

ఉ॥ ఎవ్వతివీవు కల్కికుల ♦ మెయ్యది నీయభిదాన మెద్ది నీ
వివ్వన మందు నొంటి తప ♦ సట్లొనరించెదవేమి గోరి లే
జవ్వనమందు నన్నిటను ♦ జక్కగ జాలిన వాని జెందియా
పువ్వుల వింటి దంటకున ♦ మేన్ సరిపెట్టుట యొప్పదే చెలీ ॥

వ॥ తరుణి నీవెవ్వరిదానవు నీనామంబేమి నీజననీ జనకులెవ్వరు. నీ నిజ స్థలంబెయ్యది నీవెవరినిగురించి ఇచ్చట తపంబుం జేయుచున్నదానవో సవిస్తారముగ నాతో విన్నవించుము నేవిని సంతోషించెద.

తుల॥ మీరెవ్వరు నాపేరడుగుట కిక । యూరోయ్యవయా । పైకిక । రాకుమయా ॥పైకి॥ జార స్త్రీల మనుకొంటివ మదిలో । నారుల గని యిక నవ్వేద విలలో । నోరుమూసుక దె । దారి బోందు చాల్ ॥యూరోయ్య॥ పై॥ మీ॥

చ॥ దొంగవలె నీవు యిచ్చటికి । దూగుచు దాగుచు నేగుదెంచితివిక యంగనల మార్గము నడుగ । నధికారమె మీకు మీవారికిక సంగడి చేడెలక కనుంగొని । సైగలుజేసెద వేమి గోరిలే పొంగుచు నాపైకి రాకు మిక । బొమ్మిక నీదారి నీవు బట్టుమిక ॥

వ॥ ఏమీ ఇవ్వనంబునందు తపంబుజేయు జవ్వనా స్త్రీలకడకు మీవంటి పురుషులు రానోపదు వచ్చిన మమ్మిట్లు బలుకరించి తపంబు భంగంబు జేయుట ధర్మంబుగాదు మేమెవ్వరమైతె నేమి మారు మాట లాడక మళ్లిపొమ్ము.

శం॥ ఇంత డీనివెవ్వారవన్నంమల । కింతా కోపమా । చెలినీ । కింతా కోపమా ॥చెలి॥ శాంతమె జయమని సర్వము దెలసియు । శాంతము లేకను బల్కుటకిదియు । ఇంతుల కొప్పునె పంతపు మాటలు ॥యింతా॥

కం॥ ఈలాగు నీజగమున ♦ నాలుగు వేదములుజెప్ప నాతిరో వినియుక తెలియని స్త్రీవలె నిప్పుడు ♦ పలుమాటలు బల్కుదగునె పణతిరో యికనక ॥

వ॥ కాంతామణి నీవెవరని విచారించి నంతమాత్రంబుననే నీకింత కోపమలమా శాంతమే జయంబని శాస్త్రోక్తి దెలుపగ వినియుండలేదా సర్వంబుం దెలిసియు తెలియని స్త్రీవలె పంతమాడ పాడియూ.

తుల॥ పంతము లాడెటి । ఇంతులమని నీ । కింతా దెలియదా । నాయొక । వింతా దెలియదా ॥నాయొక॥ కాంతలగని కనుగీటెటి పురుషుల । యింతుల విసరము లెంచెటి చోరుల । చెంతకు జేరగ నీయముగూడ దిక ॥యింతా॥

ఆ॥ వినుండ నాథమైన వెలదిని బాలను । వృద్ధ రాలిని మిగుల వెరుచు
దాని । సతిని తపస్సును జేయు చానను వంచరా । జేయువారు
నరక సీమనుండూ ॥

వ॥ అనునటు అనాధి జవ్వన స్త్రీలను వరుసలెంచే పురుషులు నర
కంబు నొందగలరని వేదశాస్త్ర పురాణేతిహాసంబులు దెలుపగ వినియుం
దువేమోకద అట్టి వేదాంతము మాని మాతెరవుకు వచ్చుట పాడియా
చాలుచాలు నూరకే మరలిపొమ్ము లేకయున్న నీపెత్తన మేమి దక్కం
బోదు నమ్మ్ుము.

కం॥ ఎవరని యడగిన వివరము లెంచెవు । ఏమటినే । చెలియిది ।
వాదంటినే ॥ చెలి॥ నీవంటి పతివ్రత కీవాదా । ధవళాక్షి మరియా
దయె లేదా । యావిధి బంపుతె నిటువచ్చివచ్చితి నిం । న్నేమంటి॥

ఉ॥ దోషమిదానటె నీమది । దోచక చానరో నీవు యింతేక
లేశము నొందగక పాడియె । లేమాజవ్వనాంగుల జూచి యికక
భాషణజేయకంజనిన । పాతక మటంచును మున్నుదళ
వేషుడనంగక వినలేదె । వేదశాస్త్ర పురాణము లందునక ॥

వ॥ కాంతామణి నీవంటి జవ్వనాంగులంజూచి మందలించకపోయిన
మహా పాతకమని మున్ను శ్రీకృష్ణుండు దెలుపగవిని యుండలేదా యేమి
అందులకు నిన్ను మందలించితిగాని మరేమియుంగాదు కారున ఇవ్వనంబున
నొక వనిత భర్తకొరకు బాధలపడుచున్నదని బ్రిహ్మదెల్పి పంపుతె వచ్చి
నాడను ఇందుకు యాసుందరీమణి ఎందున్నదోయని వెతకుచుంటి నింతియే
నేనిదో పోవుచున్నవాడను.

తుల–వ॥ (తనలో) ఏమీ ఈ సుందరాంగుండు శంఖచూడుండా
యేమి ఎవ్వరైన సరె ఇంతలో నా స్థితి దెల్పి తర్వాత ఇతండెవ్వరో
యడిగి తెలుసుకొనియెద గాక (ప్రకాశముగా) ఓ మహానుభావ నా స్థితి
దెలిపెద ఆగుమాగుము.

తుల॥ విన్నవింతు యిటు వినుమయ్యా నా । విన్నాపంబును । నాయొక ।
పన్నిధంబును ॥నాయొ॥ పన్నగ ధర అంబారివ్యాట శ్రీ । వెన్నుడు
దయతో నేలిన యిక శ్రీ । యున్నతుడగు ధర్మధ్వజు పుత్రిని ॥

గీ॥ ఏను ధర్మధ్వజుడను మహీశుసుతను । తులసి యను దాన శుభ మొదా దలచియిటు । తపము జేయుచు నిందుంటి ధరలుమీవు । వాంటిపాటున స్త్రీల దాపొందపలదు ॥

వ॥ అయ్యా ఏను ధర్మధ్వజ మహారాజు కొమార్తె నగు తులసీ యను దానను కావున యాశంఖచూడ దానవేంద్రుండు నాభర్తగావల యునని ఏనిచ్చట హరినిగూర్చి తపంబుజేయుచుంటినిగాని తామెవ్వరో వినంజేయుండని కోరుచున్న దానను.

వాదం - ఆది. (తరజు బాలామణినీమది కేలాయిక)

కం॥ వనితామణి నీవిటు వినుమా । నా । వార్తయు దెలిపెద మది గనుమా ॥వ॥ అనువుగ ధంబాశూరునకును నే । తనయుడ శంఖా చూడుడ వీరుడ ॥వని॥

కం॥ నను వరయు శంఖ చూడుం ♦ డను ధానవ రాజపుత్రి నధిక రతిపసిక ♦ నను బంపె నీకడకు విధి ♦ నిను గాంధర్వమున బడసి నెగడుమనె సతీ ॥

వ॥ తరుణీ వింటివా ఏను ధంభా శూరుని తనయుండవగు శంఖ చూడ ధానవేంద్రుండను నాపురంబు అమరావతి కావున మన ఇరువురికి తగిన జోడని యావిధి నిన్ను పెండ్లియాడుమని నీవున్న స్థలంబునకు బంపెను ఇక నీమది సందియ మొందక యొకసారి కౌగలిమ్ము సఖి.

తుల-వ॥ (తనలో) ఆహా శ్రీహరి నీకారుణ్యంబింతని చెప్పరాదు గదా సరి నాభాగ్యంబు ఫలించెనుగాని ఇతండు నిజంబుగా శంఖచూడుం డౌనో కాదో నాకెట్లు నమ్మకము ఇంకా యితని మర్మము దెలియునటుల మారుబలికెద గాక.

తుల॥ చాలునోయి నీ సరసము:ను యిక । చాలగ దెలిసెను । పొమ్మి కను ॥చా॥ బాలను నన్నిటులేల భ్రమ్రెదవు । చాలుచాలు నాజోలి మానుమిక ॥చాలు॥

వ॥ సరెసరె మంచివాడవుగా నున్నావు ఏను బాలికను నాజోలి మాని యూరికే మరలిపొమ్ము లేకయున్న నీమానాభి మానంబేమి ధక్కంబోదు నమ్ముము.

శం॥ గోలా నీవిటులను జేలా యిక । బాలను ననబోవమి సీలా ॥గో॥ వాలాయము రతి । వాంఛలు దెలునును । సీలా రమ్మిటు గూడి సుఖింతము ॥గోలా॥

చ॥ వలచితి నిన్ను చేడిమురో । వాస్తవమీయది నన్నుజెందు మూగులముగ కాముకేళులను । ఖాబోదనక్ దనియింతునెపుడుక్ తలపున కన్యాదాత్వమును । దల్పనొకప్పుడు నేనీపేృముడిక్ గలియగ నేగుదెమ్ము పక । గానములోన్పడు నీవనంబునక్ ॥

వ॥ సఖీమణి నిన్ను కనుంగొనినంత మాత్రంబుననే చిలుక వీలు కాదు విరు శరమూల గృహ్వచున్న వాడు గావున నీమది సందియుపడక నా మనోభ్రాంతి దీర్చి నన్నాదరింపుము.

తుల॥ మందబుద్ధి మానగ లేవు । యిక । నిందెపాలు గాకుమి నీవు ॥మం॥ సుందరీ మణుల జూచి యోర్వకను । పొందుకు బిలచుట యుంద మానాన చాక్ ॥మం॥

కం॥ పరసతిని గవగోరుట । పరధనముల కాశపడుట భావముచేతక్ పరులకపకృతిని గోరుట । ఇరవుగ చెరుపనులు దలుచ యెపుడుక్ దగదుక్ ॥

వ॥ అయ్యా తామిందాక ధర్మ శాస్త్రంబులు దెలిపి ఇప్పుడు కర్మంబులో మునుగుట ముఖ్యమేనా ఇంతవరకు నామర్మము దెలసుకొని ఇప్పుడు శంఖచూడుండనని పల్కిన నాకెట్లు నమ్మకము ఈ మాటలన్ని గట్టిపెట్టి యూరెక మరలిపొమ్ము.

శం॥ పంకజాక్షిరో నీవికనూ । యూ । రంకు యాడ నేర్చితి వికనూ ॥పం॥ రంకు నేర్చి నాశంకిని గందుకె । బొంక నేర్చున నీపెద్దలు జెప్పెను ॥

కం॥ నిను వెతకుచు వచ్చితినీ । వనముననగను గొంటినేత్రా పార్వముగ నిటుక్ । వనితా నీమది నెంతయు । జను నేవిధిక్ దప్పజేయ సఖ యిక నీకుక్ ॥

వ॥ ఆహా సఖీ ఎంతమాటాడితివి వనొకరికి బుట్టి మరొకరిపేరుద్ధరింపుదునా యేలా యీమాటలు ఇకనీవే యోచింపుము.

తుల॥ నీవను మాటయు । నిక్కమెను । యది । వవిధి దెల్పుదు సిగ్గునూ ॥నీవ॥ భావింపగ అంబారిప్యాట హరి । కావగలడు విను । కరుణతో మనలక్ ॥నీవ॥

కం॥ నిన్ను పరీక్షయొనర్చితి ♦ నన్నిట దగినట్టివాడ వైతివిటులగా ♦ కున్నేటు దెలియు నయ్యెడు ♦ కన్నియలకు బురుషు తెరుగు గను టొప్పిదమా ॥

వ॥ దానవేంద్రా మీరను వాక్యంబులు నిక్కంబేకాని నామను సంబునగలదది నీతో విన్నవించుటకు నామది సిగ్గుచున్నది యది యేమని తెల్పుదాన.

పాదం — ఏకతాళం (దనుజ అందగరానిఫలం)

శం॥ నారీమణీ సిగ్గేలా । నను । జేరావె బిరానగోలా ॥వోనారీ॥ యేరీతి బ్రతిమాలినను । నీ । వారీతె బల్కేద వికనూ । సుకుమారీ । సుందారి । నాపై ప్రేమ లేదటే ॥నారీ॥

వ॥ కాంతామణి యేనొక్క క్షణంబైన మరుతాపమూపకున్న వాడను ఇక నీమది సిగ్గుమాని ఇంతలో నా చెంతంజేరి కాంతుకేళిలో నన్ను సంతృప్తి జేయుము.

తుల॥ పరిణయమానుగాక మున్నే । యా । సురతా కేళీగూడ నగునే ॥ మనపరి॥ పరిణయమును నైనంకా । నీ । భార్యనాదు వినుమింకా । యా హరీ మురారీ । నిన్నెట్లు మెచ్చును ॥ప॥

వ॥ ఏమీ పరిణయంబుగాక మున్నె సురత కేళి గూడిన మావంటి బోటి స్త్రీ లిదివిని నవ్వరా అది యెటులన్నను పరిణయమైన తర్వాత భర్త సేవలో మెలంగుట పతివ్రతల కొప్పుచున్నదిగాని ఇప్పుడే సురత కేళి గూడ ధర్మంబుగాదు నామాట నమ్మి తామందాక తాలియుండవలయును.

శం॥ కాంతామణీ నాపైనా । యా । కఠినత ఏలనె మదినా ॥కాంతా॥ సంతసమున గంధర్వం । బడ । సింతలోన సుఖయింతం । వో కాంతా । నా చెంత । జేరీ సుఖించుము ॥కాంతా॥

వ॥ చెలీ పరిణయముగాను లేదని అనుమానింపుచుంటివా యేమి సతి మనమిచ్చట గాంధర్వ వివాహమాడి సుఖింతము రమ్మి.

తుల॥ తల్లీ దండ్రులుండగాను । యిక । జెల్లునె గంధర్వమూను ॥ మనతల్లీ॥ చల్లని అంబారిప్యాటా । శ్రీ । వల్లభుడేలు యీపూటా । నాతల్లి । నాదండ్రి । యిదివిన్నా కోపించేరు ॥తల్లీ॥

శం॥ తలిదండ్రులు దైవంబని ♦ యిలబొగడగ వలయుగాని ఇప్పుడే
మనము ♦ ఈలాగు వివాహామాడిన ♦ ఏలాగు జనులు మెత్తురు
యోచింపు మికన్ ॥

వ॥ కావున ఇప్పటి సౌఖ్యంబు కొరకు తప్పుడు నడతలు నడిచిన
పెద్దలు మెత్తురా తల్లి దండ్రి సెలవుగొని మిమ్ము వివాహ మాడవచ్చును
గాని వారిసెలవు లేనిది మనమిరువురమే స్వతంత్రి వివాహమాడుదా
మన్నను యప్పుడిెప్పటి కొప్పలేను,

వాదం – జుల్వా.

శం॥ వొప్పకున్న బలిమిన నిను । తప్పక రతిగూడెదా ॥వొ॥
తుల॥ ఇప్పుడు వలదని నీకును । జెప్పగ వినరాదా ॥ఇ॥
శం–గీ॥ తరుణీ చిలుక వీలుకాదు నా ♦ శరముల గృప్పుచున్న వాడిక
వలదనుట నీకిది న్యాయమా ॥
తుల–గీ॥ పరిణయంబుగాకమున్నె యికయా ♦ సురతకేళి గూడుమన
నన్ను ♦ బలిమిజేయుట నీకిది ధర్మమా ॥
శం–చె॥ అందు కొరకె గంధర్వ లగ్నము । ఇందు జేసు కొందమంటినీ ॥
తు–చె॥ తొందర పడు టెందుకు జనులిది విని । నిందెపాలు జేతురంటినీ ॥
శం–చె॥ ముందటి వారలు యెందరెందరో । సుందరి ముందుగ గలలేదా ॥
తు–చె॥ ముందుగ గలసిన । వారలందరు । మిడుకుచు ఆపదపడలేదా ॥
శం–గీ॥ ఆకలియైన పిదప యిక । నాలుక రుచిగోరు నెట్టులా ॥
తు–గీ॥ ఆకలియైనప్పుడు పర । మాన్న ముగావలన్న దొరుకునెట్టులా ॥
శం॥ మగువారతి గలియకున్న । కౌగలించుకొమ్మికా ॥
తుల॥ కౌగలించ వీలుగాదు । ఆగుమొకా క్షణమికా ॥
శం–చె॥ ఇద్దరి మనసుగలసిన పిమ్మట । ముద్దుకు దోషంజేమీ ॥
తు–చె॥ ముద్దు లిచ్చుటి సమయము గాదని । వద్దని యంటిని స్వామీ ॥
శం–చె॥ కొమ్మరో నిను బ్రతిమాలిన వినవదె । నమ్మికనాపై లేదా ॥
తు–చె॥ మిమ్మే నమ్మితినని దెలుపగ నిక । నమ్మించగా వలదా ॥
శం–ఆ॥ మాటలతో పొద్దు బుచ్చ । బోటినీకు న్యాయమా ॥
తు–ఆ॥ సాటివారిలోన నగు । బాటు జేము ధర్మమా ॥
శం–ఆ॥ కొంచెము నీవిటు రమ్ము ॥
తు–ఆ॥ మంచిది నీవటు పొమ్ము ॥

శం-ఆ॥ ఇంత పంతమా ॥
తు-ఆ॥ ఇంత మోహమా ॥
శం-ఆ॥ వినవదే ॥
తు-ఆ॥ జనవదే ॥
శం-ఆ॥ రా ॥
తు-ఆ॥ పో ॥
శం॥ ఒప్పకున్న బలిమిన నను । తప్పక రతిగూడెదా ॥
తు॥ ఇప్పుడు వలదని నీకును । జెప్పగ వినరావా ॥
శం-ఉ॥ కోమలి యేమనందు నిక । కోరికతో నిన్నెంత శాంత్రియించినన్
నీమది కరుగదాయె నా । నేరము దేమి మాకుని భారికిన్
నామది నిల్వకున్న దిక । నక్కట ఏమి సేయుదు నింతలా
తామర సాక్షిరో నా కిక । దైవము సాక్షిగ మూర్ఛ వచ్చెడిన్ ॥
వ॥ హా సఖి. (అని శంఖచూడు మూర్ఛిల్లిన తులసి)

తుల-వ॥ ఏమీ ఈ సుందరాంగుండు మరుతాప మాపలేక మూర్ఛిల్లెనుగద హా సర్వేశ్వర యిక నేనేమి సేయుదును.

సం-వ॥ అంతలో బ్రహ్మ వచ్చి తులసినిగని కోపముతో.

బ్ర-వ॥ తులసీ నీవు గోరుకున్న వరుండిందరు దెంచిన వీన్ని నిరాకరించి మూర్ఛ నొందజేసితివా చాలుచాలు నీకపట తపస్సు నాకుండెలిసెను ఇక నీవిచ్చటినుండి వెల్లిపొమ్ము.

తుల-వ॥ స్వామీ నలినసంభవ నాతప్పు క్షమించుడని ప్రార్థింపుచున్న దాన.

వాదం – ఆదితాళం (తరజు – పరమేశ్వర బీూరీ)

బ్రహ్మ॥ సుందరి తులసీ । యిందుని భావన । ముందుగనీ వీనిని భ్రమసీ॥
సుం॥ సందియ మొందుచు శంఖచూడు నీ । యందు ప్రేమ మానిన వేటికి ॥సుం॥

గీ॥ తగిన యన్నంబు సరసకూ దగినకూర । చేకూరుట దుర్లభంబగు క్షితి తలమున । దగిన జోడీరలిర్వురింపు గదగన్ శు । భస్యశీఘ్రమ్మనుదు నన్ను బాసియికను ॥

వ॥ తులసీ సతీ వంటఇ టికి కుందేలు వచ్చినట్లు వరుండు నీసన్ని ధికి వచ్చిన వరించక అనుమానింపుచున్న కారణమేమి.

తుల॥ సందియ పడుచుంటి । సర్వేశ్వర మదియుందున యెటుదోచక నుంటి ॥సం॥ అ దమైన హల్యను జూచోర్వక । ఇ ద్రుడు జెరిపిన విధమానని ॥సంది॥

వ॥ దేవా ఇతండు శంఖచూడుండౌనో కాదోయని అనుమానింపు చుంటినిగాని వేరొండుగాదు స్వామి.

బ్రహ్మ॥ బాలామణి వినవే । గోలోకమునంగల యలసుధాముని గనవే ॥
భా॥ నీలో నాలోచన జేయకను । నీలా వీనితో । గూడి సుఖించుము ॥బాలా॥

గీ॥ తులసి గోలోకమున నుండు లలితమూర్తి ♦ యలసుధాముడితడు
నీవు నల్లరాధి ♦ గోరుశాపవశమ్మున నూర్విబుట్టి ♦ నారుదంతు
లౌదురు మీరలిందు॥

వ॥ బాలికా పూర్వమితండు హరి మిత్రుండగు సుధాముండు రాధ శాపవశమ్మున ధానవుండై జన్మించెను వింటివా.

తుల॥ మేల్ మేలాయెను గానీ । నలిన సంభవా నాలోగల మనవియు
వూనీ ॥మేల్ మేలా॥ వాలాయము ధానవ మానవులకు । వైరము
గలదేమోకద యిక ॥మేల్॥

వ॥ స్వామీ ధానవ పురుషుని మానస్త్రీ వరించ వచ్చునా.

బ్రహ్మ॥ సరసీరుహానేత్రి । ధారుణిలోపల । పేరు వహించెద వికధాత్రి ॥
సర॥ ఆరూడిగ అంబారిప్యాట శ్రీ । వారిజాసనుడనై బ్రోతును ॥
ఉ॥ వీడు మహా తపస్వి బల । వీర్యములందసమానుడెంతయున్
జూడగ నొప్పు నందముల । సొంపుల కాస్పదమైనవాడు నీ
కీడును జోడునై తనరి । ఇంపుదలిర్చెడు వాడు వీనిదా
కూడిక నొందు భోగముల । గొందువు సందియ మొందకుగ్మలీ ॥

వ॥ కావున నీ పూర్వపుణ్య విశేషంబు వలన నీకీ పురుషుండు లభించెను ఇక నీమది సందియ మొందక వీనింగూడి సుఖంబుల నొందుము.

తుల-వ॥ సరి మీరుండెల్పు విధంబున నే మెదులుదాన గాని ఇమ్మహాత్మునిప్పుడు తెలివొందించి మమ్మాశీర్వదింపుడు.

బ్ర-వ॥ సరి మంచిది దట్లులనే లేపువాడను (అని శంఖచూడుని గాంచి) శంఖచూడా లెమ్ము లెమ్ము ఏనజుండను.

సం-వ॥ అంత శంఖచూడుండు తెలివొంది బ్రహ్మనుగాంచి.

శం-వ॥ దేవా వారిజాసన మీకిదో నమస్కరింపుచున్నవాడను కటాక్షించుడు.

బ్ర-వ॥ శంఖచూడా వర్ధిల్లుము గానీ నొక్క విశేషము.

చ॥ తడవానరింపబోకుమిక । ధన్యనిజెందిమనోజ భోగముల్
పడయుము వేగనేకతమ । భామలు దక్కన నాలసింతురే
బెడగగు సోయగంబుగల । బిత్తరి ఈ పడుచీవునట్టులే
బెడగగు సోయగంభమరు । లేమక కాడ వింకేల కొంకుటల్ ॥

వ॥ శంఖచూడ నీవిట్లు నాలసింపుచున్న కారణమేమి.

శంక-వ॥ స్వామీ ఈ సుందరీమణి నన్ను నమ్మకయున్నది గదా.

బ్ర-వ॥ హే తులసీ సతియొక్క విచారము.

తుల-వ॥ స్వామి అదెట్టి విచారమో వచించుడు.

బ్ర-కం॥ రమణివి నీవన్నింటను । రమణుండితండెల్లయెడల రాజిలు మీయో । గము రమణీయము వీనిక । గమనీయతరాంగి చెందు గాంధర్వమునక ॥

వ॥ కావున ఇప్పుడీ వనంబున మీయిరువురికి గాంధర్వ వివాహంబు గావించెద నీవొప్పుకుందువా.

తుల-వ॥ చిత్తము అట్టులనే గావించుడు.

బ్ర-వ॥ సరి మంచిదిచ్చట కూర్చుండుడు.

శ్లో॥ తదేవలగ్నం సుధినంతదేవా । తారాబలం చంద్రాబలం తదేవా
విద్యాబలం దైవాబలం తదేవా। లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి
సుముహూర్తస్సావధాన । సులగ్నస్సావధాన ॥

సం-వ॥ ఇట్లు తులసి శంఖచూడులకు గంధర్వ వివాహంబు గావించి బ్రహ్మ ఇట్లనియె.

వ॥ హే తులసీ శంఖచూడుల్లార మీకు గంధర్వ వివాహంబు గావించినాడ ఇక మీరు అన్యోన్య అనురాగంబునంగూడి సుఖంపుడు ఏనీదే సత్యలోకంబున కేగుచున్నవాడ.

తుల-వ॥ చిత్తము పోయిరాండు గాని యొక మనవి.

బ్ర-వ॥ అదెట్టి మనవియో వచించుము.

తుల-వ॥ స్వామీ మాకెట్టికీడు రాకుండగా మీయాశీర్వాదం బివ్వుడు.

బ్రి-క౦॥ తులసీ నీపతివ్రిత్యం। బిలనూనున్నంతవరకీ భూమిలో యెవరుగ్ గెలువగ జాలరు మిమ్ముల । నీలామీకిదియె వరము జయమగా నెవుడున్ ॥

వ॥ కావున నీపతివ్రత్యంబు చక్కగా గాపాడుకొని తిరుగుము ఇదే నేబోవుచున్న వాడను.

సం-వ॥ అంతలో బ్రిహ్మ నిష్క్రమించిన తులసి శంఖచూడునిగని.

వాడం - (తరుజా లోప్యారికి హైబాగయి జీతు)

తుల॥ సంతసమాయెను మంతనమున వో । కాంతా నేడికను మనమింతలో నవనవింతలుగని క్రీడింతము ముదమునను । సఖానా చెంతకురమ్మికను బహుసంతసమా ॥

శంక॥ ఇంతీనీవను విధముమెదిలెద బ్రాంతీతోనికను । మనమింతలో యీతెరువుల చెంతను। క్రీడింతమురమ్మికను పంతములాడకను ॥

తుల॥ ఓ... కాంతా యీ విరహామును నే । నెంతమాత్ర మాపాలేను ఇంతలోతడవును జేయక నాయొక । బ్రాంతిదీర్చుమా యీసఖా నీ భార్యను గానోయీ ॥బహు॥

శంక॥ ఓ... నారిమణిరో అజుడు నేడూ । గలిపిపోయెను మనకిజోడూ స్థిరముగ ఈ వనవృక్షము మొదటను । సరసములాడుదమా సఖి మరు । కేళియు గూడుదమా ॥వో ఇంతీ॥

తుల॥ ఓ... అందమంత నీదేనోయీ । ఆపలేని విరహామోయీ పొందు గాను అంబారిప్యాట శ్రీ । ఇందిరేశ్వరుడును కృపాయుం దలచియు బ్రోచికను ॥బహు॥

శంక-వ॥ సఖిమణీ ఈ మల్లెపొదలిండ్లయందు ప్రమోదంబు నరస ప్రసరాంచి కాత్మ్మలమై నిష్ఠభోగంబులుసల్పి అమరావతికి పోవుదముర మ్మ్మ.

తుల-వ॥ చిత్తము పదుండు (అని తులసి శంఖచూడు లిష్టభోగం బుల సల్పి అమరావతికి జేరబోవు సమయంబున దవళ తనతో)

ధన-వ॥ ఏమీ మత్కుమారుండు పుష్కరంబునకుంజని ఇంతవర కైన రాడాయెను గద (అంతలో దానుడు వచ్చి)

ధం-వ॥ జీవితేశ్వరి నీవేమో చిన్నంబోయి నాలోచించుచున్నా వానకు కారణమేమి.

ధన-వ॥ ప్రాణేశ్వర మనకుమారుండు పాఠశాలబాలురతో పుష్కర తీర్థ బునకుంజని ఇంతవరకైన రాడాయెను గద అట్టి సమాచారము తమ కేమైన దెలిసియున్న దాచకనాతో వచించుడు.

ధం-వ॥ సుందరీమణీ ఇందుకొరకే నీవు చిన్నబోయి యున్నవా మనకుమారుండు బ్రహ్మచే వరంబుగొని సతీతులసిని పెండ్లియాడి మన పురంబునకు వచ్చుచున్నవాడని వినియుంటిని కావున ఇంతలోనే రాగలడు నామాట నమ్ముము.

ధవ-వ॥ ఏమీ మనకుమారుండు తులసిసతిని వివాహంబాడి వచ్చు చున్నవాడా అహామన భాగ్యంబెంత దొడ్డదిగావచ్చును.

సం-వ॥ అనుచున్నంతలో తులసి శంఖచూడులువచ్చి.

శంక-వ॥ హేజననీ జనకుల్లార మీకిదో నమస్కరించుచున్నవాడను కటాక్షించుడు.

ధం-వ॥ కుమారా శంఖచూడ వర్ధిల్లుము వర్ధిల్లుము.

నాదం - ఏకతాళం (తరుజు - నందననీకిది మేరా)

ధం॥ తనయా నీవిటు రారా । నిను । గనుగొన మోధంబౌరా ॥నాతన॥
అనువుగ వనటాసనుడూ నినుగని తానేమని పల్కినడు ।నది। విను
పుము విందును నేడూ ॥నాతన॥

వ॥ కుమార శంఖచూడ యా బ్రహ్మ నిన్నుగాంచి యేమని పల్కినడో సవిస్తారమంత వినంజేయుము నేవిని సంతోషించెద.

శంక॥ వాణీశుడు కరుణించీ । నా । వద్దకు తానరుదెంచి ॥యావన॥ అను
వుగ నను దీవించి । యీ । వనితకడకు యేతెంచి । మా । కును
వివాహము గావించి ॥యావన॥

వ॥ జనకా యావిధి మా ఇరువురికి గంధర్వ వివాహంబు గావించి మమ్మా దీవించిపోయెను వింటివా.

తుల॥ దండములిదో ధనుజేంద్రా । మా । బ్రాండకోటి గుణసాంద్రా । నాదండ॥ నొండొరులను గోరకను ।మీతన। యుండేపతియని యేను మీ। యండ జేరితి యికనూ ॥నాదండ ॥

వ॥ మామగారు ఈ తులసి మీపాదంబులకిదో నమస్కరింపు చున్నది కటాక్షించుడు.

ధం॥ బాలామణి తాదస్తూ ।బహు। మేలగు తత్వలమొస్తూ ॥వోబాలా। వాలాయము పతివ్రతలా । సరి । బోలినదాన వెలత లాగుణశీలురు మెచ్చెరు చాలా ॥వోబాలా॥

వ॥ అహాహా బాలికా తులసి వర్ధిల్లుము వర్ధిల్లుము నీసాహస వితరణాది సుగుణంబు లింతని చెప్పరాదు భగవత్కటాక్షంబున మత్కుమారుని పరిణయంబాడి మాకు కోడలవైతివా తల్లీ యిటు రమ్మా.

ధవ॥ నందననీవిటు రారా ।నా। నందముతోనను జేరా ॥నానంద॥ అందముగను నీవిటకూ । యీ సుందరితో వచ్చుటకూ । బహు । జెందితి పుణ్యంబులకూ ॥నానంద॥

వ। తనయా నీవెంత క్షుదగొని వచ్చితివో అన్నము భుజించుదువు రమ్మా.

శంక॥ వచ్చితినీ యిదో జననీ । యిక । వైలమునినుగనవూనీ ॥నేవచ్చి॥ ఇచ్చతోనను దీవించుచూ ।నా। ముచ్చటలను యాలించుచూ ।నీ। విచ్చెలినీ సవరించుచూ ॥నేవచ్చి॥

వ॥ అమ్మా మిమ్ము కనుగొనినంత మాత్రంబుననే నామనంబానందంబాయెను గానీ నీకోడలిని దగ్గరకు బిల్చుకొనుము.

తుల॥ వందనములు గొనుమత్తా ।న। న్నాదరించెటి కర్తా ॥నావంద॥ ముందటి జన్మఫలమునా ।మి। మ్మందిచూచి ఈలోనా ।నా। నందము నొందితియికనా ॥నావంద॥

వ॥ అత్తయ్యా నీకిదో నమస్కరింపుచున్నదాన నన్నాదరించుము.

ధవ॥ సుందరీ వర్ధిల్లుమికా । నా । సుగుణాల, రామజిల్కా నాసుం । అందమైన అంబారీ । స్యా । టెంది రేశ్వరుని కోరీ నాసందియు దెల్పెద భూరీ ॥వోసుంద॥

వ॥ అహా తులసీ నీవంటి పతివ్రతి శిరోమణులీ లోకంబునంగలరా తల్లీ ఇప్పటినుండి మాఇంటికెజమానురాలవయ్యి యమ్మగాపాడుము.

సం-వ॥ అని దంబునిగని నాథా మనకుమారునకీ అమరావతికి పట్టాభిశక్తుని జేయుండని కోరుచున్న దాన.

ధం-వ॥ సరి మంచిది దట్టులనే జేయువాడను (అని శంఖచూడుని గాంచి) కుమారా శంఖచూడ ఇప్పటినుండి అమరావతి పాలింపుచు దానవులకెల్ల మేలుజేయుము ఇదో ఖడ్గంబుచేకొనుము.

శంక-వ॥ చిత్తము జనకా మీరుచెల్పునట్టులనే వర్తించువాడను నమ్ముడు.

ధం-వ॥ సరి అనుష్ఠానంబునకు వేళైనది అంతఃపురంబునకు బోవుదము రమ్ము.

సం-వ॥ అని అందరు నిష్క్రమింతురు పరుద వాలెలును.

శుక్రాచార్యుల - ప్రవేశము - దర్వు (శిల్యుడక శాండీ)

శు॥ ఆర్యుడక భార్గార్యుడక । మది । ధైర్యుడక సాకార్యుడక ॥అర్యు॥
కార్యసాధన ఘనుడధానవ । వర్యులకు గురువర్యుడక ॥అర్యు॥ ధానవులకు సన్మానము జేసిన । ధైర్యుడ దయగుణశాయంశక । అనుదినము నాయాజ్ఞలుంచుకొని । వినయము దెల్పిన వీగుండక ॥అర్యు॥
వాటాయము అంబారిప్యాట శ్రీ । పాలాక్షుని నీప్రస్తుతించియున్న
అలములోన ధురాత్ముల గర్వము । సేలుగవంచిన శుక్రాధారిక ॥

వ॥ (తనలో) ఏమీ ఇంద్రాది దేవతలంత నా శిష్యులగు ధానవుల నోడించి యపూర్వ రత్నంబులెల్ల దొంగిలించుకొని నిక్కినీల్గుచున్న వారే సరి నేనీ సమయంబున శంఖచూడుని సన్నిధికేంజని పూర్వసమాచారంబంతయుం దెల్పి దేవధానవవైరంబు గల్పించి సురలగర్వంబడంచి ఏను జయంబుగొనియెద గాక.

సం-వ॥ అని నిష్క్రమించిన అమరావతిలో చంఖచూడ సభ.

శంక-వ॥ శణ్ముఖా మన అమరావతి ధానవులకెల్ల క్షేమమేకదా.

శన్ము-వ॥ శంఖచూడ ధానవేంద్ర మనపురంబున సకల ధానవులు సుఖోపాయులయ్యే యున్నవారు గాని అదో మనకులగురుండగు శుక్రాచార్యులవారు ఇచ్చోట విచ్చేయున్నవారు కనుంగొనుము.(అంత శుక్రుని గని శంఖచూడిట్లనె)

వాదం - (తరుజు చందనమిదో మానిచంద్రివర)

శంక॥ వందన మిదో శుక్రాచార్య । వరగుణ ధైర్యా ॥వం॥ పొందుగ
యీ మణిపీఠము । నందూన గూర్చొని నొందూడి నందంబు ॥వంద॥

వ॥ గురువర్యా మీకిదో నమస్కరింపుచున్న వాడను కటాక్షించి మీరీమణి పీఠంబున గూర్చుండుడు.

శు॥ చల్లగ వర్ధిల్లుదాన వల్లభనేడూ ॥చల్ల॥ పల్లవపాణులునిన్ను । ఎల్ల
ప్పుడు గొల్వ ఏలుమి రాజ్యంబు ॥చల్ల॥

వ॥ శంఖచూడ వర్ధిల్లుము గానీ మీవారంత క్షేమంబుగ యున్న వార లేనా.

శంక॥ స్వామీ గురువర్య మేము । క్షేమమేగాని ॥స్వామి॥ ఇమ్మహిమన
ధానవులకు । యేమికొరతలేక క్షేమంగనున్నార స్వామీ॥

వ॥ ఆచార్యా మేమందరము క్షేమంగనేయున్న వారముగానీ తమ శిష్యులగు ధానవులకెల్ల క్షేమమేకదా తెల్పుడు.

శు॥ ఏమని తెల్పుదు ధనుజుల । శ్రీమలునీకును ॥ఏమ॥ భూమిలో నగు
బాటుజేసి । కామితార్థములన్ని గైకొని పోయిరి ॥ఏమ॥

వ॥ కావున అట్టి ధానవుల గోషలునీకేమని తెల్పువాడను తెల్పుటకు నానోరాడకున్నది.

శంక॥ గురువర మన ధానవులకు । వైరుడెవ్వడు ॥గురు॥ నరుడో కిన్నరుడో
సురవరుడో నాకు । సరగున దెల్పుము ॥గురు॥

వ॥ ఆర్యా మన ధానవులకింత మోసంబుం జేసిన పాపాత్ముండెవండో శీఘ్రంబునం దెల్పుడు వాని బట్టి కట్టి కొట్టితెచ్చి మనపురంబున చెరబెట్టియుంచువాడను నమ్ముడు.

శు॥ ధారుణీ అంబారిప్యాట । శౌరిమిత్రుడూ ॥ధారు॥ సురవరులతో నను
దెంచియు । ధీరతవహించి జారగొనియు పోయె ॥ధారు॥

ఉ॥ మున్ను నిలింపులెల్లరును । భూర్వసుపర్వుల సాయమొందిసం
పన్నుతతోడ బాల్కడలి । బట్టివధించి యపూర్వరత్నముల్
చిన్నల వన్నలన్ ధనరు । చెల్వల నచ్చరలన్ సుధాఘటం
బున్నరిమీర జారగొని । మోసముజేసిరి దైత్యకోటికిన్ ।

వ॥ కావున దేవేంద్రుండు మాయొక్క పూర్వరత్నంబులన్ని దొంగిలించుకొని మమ్మెంతో శ్రమల పాలుజేసెను వింటివా.

వాదం – ఆటతాళం (తరుజ విష్ణువట ధానవుల)

శం॥ ఇంత కావరమా సురేంద్రున । కెంతమాత్రము భీతిలేకను ॥ఇంత॥
పంతగించియు ధానవులకీ పగిది మోసము జేసెనెట్లు ॥ఇం॥

వ॥ ఏమీ యాదేవేంద్రుండు మావస్తువాహనంబులు దొంగిలించుకొని పోయెనా సరి మంచిది వాని మధంభడంచి మనవస్తువాహన రత్నంబులెల్లగొని తెచ్చెదను నామాట నమ్మి తాము కొన్ని దినంబులు తాలియుండుడు.

శు॥ శంఖచూడ వాని గర్వము । యింక యేమని తెల్పుదునుయా ॥శం॥
పంకజాక్షుని సఖుడనంచును । మంచుచున్న వాడు యెంతో ॥శం॥

వ॥ శంఖచూడ వింటివా మంచుధానవులతో నేమానని వాడెంతో పొంగుచున్న వాడు.

శంక॥ మంచిది వినుయా మధాంధుని । మర్మమెల్లను దెలిసెనుభళ్ ॥మం॥
కొంచగాని పురముకేగియు వంచివచ్చెద వాని మత్తియు ॥మం॥

వ॥ భార్గవా ఏలిప్పుడే స్వర్గంబునకేగి ఇంద్రాది దేవతల నోడించి మనకు గొనితెచ్చెద సెలవొసంగుడు.

శు॥ ఎందుకింతా తొందరయు నా । సందియంబును దెల్పెదా విను ॥ఎం॥
పొందుగా ఆంబారిప్యాట నంధివాహనుడేలుగాని ॥ఎంమ॥

వ॥ రాక్షసేంద్ర స్వర్గలోకంబునకు నీవొంటరిగా బోవలదు వరూధినితో జని సురుల నోడించి నాకంబుగొనిరమ్ము నీకెదియే సెలవు పొమ్ము.

శంక-వ॥ చిత్తము ఆర్యా అట్లులనే జనుదెంచు వాడను (అని షన్ముఖునిగాంచి) షన్ముఖా ఇంతలో స్వర్గలోకంబునకు దండెత్తి పోవలయును. కావున నీవు వేగంబున మనసైన్యంబును చక్కగా సమకూర్చుకొని రమ్ము ఆలస్యంబు వలదు.

షన్ము-వ॥ చిత్తము ధానవేంద్రా అట్లులనె మనసైన్యంబు సమకూర్చుకొని వచ్చుచున్న వాడను పమ్ము.

సం-వ॥ అని నిమిష్క్రమించిన పరుడ వారిలును.

---

# చతుర్థాశ్వాసము

## స్వర్గలోకము

—(దేవేంద్రుని సభ దర్వు - ఆది. (శ్రీ సాంబమూర్తిని రా)—

ఇం॥ దేవాది నాయకుడా। భూదేవి సుతుడవై భవోన్నతుడనే ॥ దే॥ దేవ దేవునని శమునను యికనా। భావమందు నమ్మి సురలమునులకా। కోవిధులా మెచ్చనడత గోరిన। పావనుండ ॥దే॥ ఇందిరేశు మిత్రు డరా। యా। నందభరిత సుందరాంగుడనునే ॥ఇం॥ గంధర్వులైన రంభ ఊర్వశి। ఘృతాచియును మేనక తిలోత్తము। లందరికా గుంపుగూడ్చి నాట్యము। పాడింతు ॥దే॥ శూరాగ్రగణ్యుడరా। సుకుమార శరీరుడ ధిరుడ వీరుడ ॥శూ॥ పారగంభీరుడనై భూ। భార మణచియుండి। యింతలోన ధరణి అంబారిప్యాట వాసుని। కోరి కొలతు పేరుగాంతు ॥దే॥

వ॥ కుమారస్వామీ.

కు-వ॥ పురంధరా ఏమియాజ్ఞ.

వాదం - ఆటతాళం - (తరుజు విష్ణువట ధానవులకెల్ల)

ఇం॥ క్షేమమా స్వర్గాపురంబున। సురలకెల్ల కుమారస్వామి ॥క్షే॥ నీమదిలో ధాచక యిక। నిక్కముగ వచియించు మింతలో ॥క్షే॥

వ॥ కుమారస్వామి మనస్వర్గంబునంగల సురముని బుషిపుంగవుల కెల్ల క్షేమమే కద.

కు॥ దేవనాయక మన పురంబున। దేవతులకునువెల్ల క్షేమమె ॥దేవ॥ భావ మందున సురులుమిమ్మే భాగుగను గొనియాడిరింకను ॥దేవ॥

వ॥ సురనాయకా మనస్వర్గంబునంగల సకల సురలు సుఖోపాయు లయ్యేయున్నవారు మహాప్రభో.

ఇం॥ సుందరీమణులైన యా గంధర్వకాంతల యిందు భిలచియు ॥సుంద॥ అందమొందగ నాట్యములను। ఇందుసల్పుమనియు దెల్పుము.

వ॥ కావున సకలసురముని పుంగవులు మెచ్చ రంభ ఊర్వసి మేనక తిలోత్తము లింపు రావించి హరిచరిత్రంబులు చదువుట కాజ్ఞాపించుము.

ఇు॥ ధారుణీ అంబారిప్యాట । శౌరి చరితను యింతలోనట ॥ధారు॥ ధీరతా వహించి నాట్యము । భూరి కొల్పుచున్నరదో విను ॥ధా॥

వ॥ మీరను విధంబే గంధర్వ కాంతలనెల్ల రావించినాడను కనుంగొనుడు. (అంత రంభ ఊర్వసులువచ్చి)

రం-ఊ వ॥ పురంధరా మీకిదో అభివందనములు.

ఇం-వ॥ స్త్రీ రత్నములారా వర్ధిల్లుడు.

రంభా - ఊర్వసి - నాట్యం - దర్వు (పిలుచకురా నలుగ)

గోపాలా । మాంపాలా । కాపాడర నను । కరిరాజా । చపలము చేయకురా రాజా ॥గోపా॥ నాపై నీకూ కృపరాదేలా । రూపవిలాసా కోపమదేలా ॥ తాపసనుత మరుతాపము సైపర । నాపాలిదేవ నన్నేలర గజరాజా ॥గో॥ కొలచిన వారి కొలవుర స్వామీ । తలచినవారీ ధనమురభూమీ । పిలచినవారికి పెరటి కల్పమురా ॥ చాలగ నన్నీవేల పాలించర రాజా ॥గో॥ బృందావనిలో నందకిచోరా । సుందర రూప నన్నందు కోవేర । పొందుకు బిలచిన పలుకవదేలర । అందముగ అంబారిప్యాట శ్రీ । ఇందిర వర రారా ॥గోపాలా॥

ఇ--వ॥ అహాహో కుమారస్వామి వీరి గానకళా నాట్యంబులు విన్నంతలో నామనంబానందంబాయెను సరి వీరికి తగిన బహుమానంబు లొసంగుము.

కు-వ॥ చిత్తము మీరలాజ్ఞాపించిన విధంబుననే రంభాది కాంతల కెల్లరకు తగిన బహుమానంబులొసంగివాడగాని అదో త్రిలోకసంచారి యగు నారదమునీందు్రండిచ్చోటికి విచ్చేయు చున్నవారు కనుంగొనుడు.

ఇం-వ॥ సరి మంచిది రానిమ్ము. (అంత నారదులు)

దర్వుయేకతాళం

నా.ర॥ మాధవ మధుసూధనా । నమోనమో ॥మా॥ రాధా కరుణా మాధవ సుగునా । రాధ వినోదా । లక్ష్మీరమణా ॥మా॥ చిర కాలము నీస్మరణ పఠించిన । వారికి నీ ఆధారుడ వీవే ॥మాధ॥ నీలశరీరా । నిగమ విచారా । పాలకడలిలో కైకమూర్తి హారి ॥ మాధ॥ భాసురముగ అంబారిప్యాట శ్రీ । వాసుడవే నీ । దాసుల బ్రోవుమి ॥మాధ॥

వ॥ నారాయణం. (అంతలో ఇంద్రుండు నారదుల గాంచి)

ఇం-వ॥ నారదా నమస్కారము.

నా-వ॥ పురంధరా అష్టైశ్వర్యాభి వృద్ధిరస్తు.

వాదం - యేకతాళం (సుగ్రీవా లంకకిపుడు)

ఇం॥ నారాదామౌని నినుగనీ । నందంబు నొందితీ ॥నా॥ శారాధా తనయ నిన్నోక । సమచార మడగితీ ॥నార॥

వ॥ నారదా ఈ పదునాల్గు జగంబులందుగల దేవమాన దానవు లెల్ల ఇట్టి స్వర్గ నాయకుండగు ఇంద్రునకు ఎట్టి శత్రుత్వంబుంలేక మిత్రులై నన్నే బొగడుచున్న వారలేనా తెల్పుడు.

నార॥ సురనాథా యింతలో నొక । వైరుడు నుదయించెనూ ॥సు॥ మరి వాన్ని గెల్వగా నీ । తరమును గాదందునూ ॥సుర॥

వ॥ అహాహ పురంధరా నీవెల్లప్పుడు రంభాది కాంతలతో నాట్యం బులాడింపుచు సంతోషింపుచుంటివిగానీ స్వర్గంబులో జరిగెడు సమా చారము నీకేమైన దెల్యునా ఇంతలో నొక శత్రుండు స్వర్గనాకముగొని పోవదలచి వరూధినితో యుద్ధంబునకు వచ్చియున్నవాడు వింటివా.

ఇం॥ శత్రుండూ ఎవ్వడో యిక । సరగుణ వచియించుమా ॥శ॥ ధాత్రిలో వాన్ని యిక నే । దక్కా నివ్వను సుమా ॥శత్రుం॥

వ॥ బ్రహ్మ పుత్రా మన స్వర్గనాకంబుగొనిపోవ దలచిన శత్రుం డెవండో శీగ్రంబునం దెల్పుడు వాన్నిప్పుడే వధించి వచ్చెద.

నార॥ శత్రుండూ ధంబు నీయొక । పుత్రుండే యనదగూ ॥శ॥ మిత్రుండగు శుక్రుని చే ఈ । శత్రుత్వంబన దగూ ॥శత్రు॥

వ॥ ఇంద్రా నీవు మున్ను ధానవుల నోడించి వస్తువాహాణ రత్నం బులుగొని తెచ్చిన పూర్వ స్తితి శంఖచూడునకు శుక్రుండు దెల్పిన అట్టి ఘనుండు సభార్యుండై యుద్ధంబునకు వచ్చి యున్నవాడు ఇక నేవచ్చి చాల నాలస్యంబాయెను ఇదే నే సత్యలోకంబున కేగుచున్నవాడ.

సం-ష॥ అని నారదులు వెల్లిన ఇంద్రుడు కుమారస్వామినిగని.

ఇం॥ వింటివ కుమారస్వామీ । విధమెల్లా నీవును ॥విం॥ కొంటెగాన్ని బట్టి కొట్టి । గొని తేవలె యిటకునూ ॥వింటి॥

వ॥ కుమారస్వామి మన మిప్పుడే యుద్ధురాత్మునిపైకి యుద్ధంబునకు వెడల వలయును కావున సకల సురలను అస్త్ర శస్త్రంబులతో గుమి గూడుకొని వేగంబున రమ్మని వాన్ని తత్క్షణంబున భరిమార్చి వత్తను.

కుమా॥ ధరణీ అంబారివ్యాటా । శౌరిని మదినెంచియు ॥ధ॥ సురనరులు బాగుడగను యా । వైరుని తెగటార్ధము ॥ధర॥

వ॥ మీార లాజ్ఞాపించిన విధంబే సురలు నానాయుధంబులు ధరించి యుద్ధంబునకు సన్నద్ధులై వచ్చుచున్నవారు వేగంబున బోవుదము పదుండు.

ఇం-వ॥ సరి మంచిది రాండు.

సం-వ॥ అని ఇంద్రుడు శంఖచూడు కడకేగి ఇట్లనియె.

వాదం - యేకతాళం. (తరజు - ఎవ్వడవుర నీవటనిల్వు)

ఇం॥ నిలు నిలురానీవెవ్వడ వచ్చుట । నిల్చి నాతో రణరంగము జేయుమి ॥నిలు॥ కలుడ నిన్ను బట్టి యింతలోన । గూలనేసి కీర్తి గొందు ధరలో ॥ని॥

వ॥ ఒరే దురాత్మ నీవెవండవు నీనుధమడగించుటకె ఇంద్రుండు విచ్చేయు చున్నవాడు పారిపోక నిల్వంబడుము.

శం॥ పారిపొయ్యె వాడను గానుర నే । శూరుడ శంఖా చూడుడ ఘనుడను ॥పా॥ కాకుమాటలు బల్కిన నిన్నిక । జీరి ధానవుల కర్పించె దనే ॥పారి॥

వ॥ ఒరే ఇంద్రా ఏను పారిపొయ్యె పిరికి షంఢనుగాను అమరావళి పాలించుటకె శంఖచూడ దానవేంద్రుండను కావున నీవు మున్ను మావారి రత్నంబులు దొంగిలించుకొని తెచ్చుకున్నావట అట్టి రత్నంబులు మంచి మాటలచే నొసంగుము లేకయున్న నిన్నిప్పుడే ద్రుంచి ధానవులకు మేలు జేసెద చూడుము.

ఇం॥ శంఖచూడుడవై తేమిర నీ । భింకములకు నేబెదురుదునా ॥శం॥ ఇంకనీదు అమర్త్య పదవి నీ । జంకులేక గైకొందు చూడు మిక ॥

వ॥ కావున ఏ నిదువరకు జారగొన్నవేగాక నిన్ను ద్రుంచి అమరావళిని అమర స్వర్గంబుగా జేసుకొనియెదను చూడుము నా పురుషార్థము.

శం॥ ఇంకా నీమది ఆశలు బెట్టుక । దుంకు చుంటివా దుర్మదాంధ॥
ఇం॥ రంకు తనంబును మానియు మాయొక । రత్న వాహనంబుల నొసంగు మిక ॥ఇంకా॥

వ॥ కావున ఇప్పటికైన నీమది బుద్ధిదెచ్చుకొని మావాహనంబులు మాకొసంగుము లేకయున్న మదీయ ఖడ్గంబుచే నిన్ను ద్రుంచి ఈ స్వర్గం శేల. వాడ నమ్ముము.

ఇం॥ ఎంతవాడవురా ధానవేంద్ర నిక । న్నింతలోన ద్రుంచి జయము గొందుమిక ॥ఎం॥ రంతుయేల నీజననీ జనకుల । యింతలోన దలచు కొమ్మి నీవిక ॥ఎంత॥

వ॥ ఒరే ధానవ నీభింకపు మాటలకేను బెదురువాడగాను ఇదే నీపైకి నాగాస్త్రంబు ప్రయోగింపుచున్నవాడను శూరుండ వౌదువేని దీనిందప్పించు కొనుము చూచెద.

శం॥ చాలుచాలురా ఇంద్రా నీయొక । సాహసమును గనుగొంటిని నేడిక ॥చా॥ వాలాయము అంబారిప్యాట స్త్రీ । లోలుడు వచ్చిన బీతినొందనిక ॥చా॥

వ॥ ఒరే ఇంద్రా నీనాగాస్త్రంబును ముక్కముక్కలుగా ఖండించి నాడను చూడుము.

వాదం — ఆది. (తరజు — శ్రీసాంబమూర్తినిరా)

ఇం॥ ఒరే మూర్ఖ ధనుజా । నా । శరంబు వచ్చెను భరించుకొను మిక ॥ఒ॥ సురరాజ వైభవుండనని నీ । వెరుంగకను యిత్తెరంగి బల్కేవు । దురాభిమాన నీ । శిరంబు యింతలో । ద్రుంతు చూడు । గాంచు నేడు ॥ఒరే॥

వ॥ ఒరే దుర్మార్గ ఇదో నీపైకి మదీయ ఇంద్రదత్త భాణంబు ప్రయోగింపుచున్నవాడను పురుషార్థివైతె దీనిందప్పించు కొనుము.

శం॥ పురంధరా నీశరమున్ । యిక । భరించి మదీయ శరంబు విడచితి॥ పు॥ హారీహారాదులు అడ్డగించి నను । ఆగబోదు మత్సర జాలము యిక । క్రూర చిత్త నిన్నుబట్టి యింతలో । గూలనేతు । కీర్తి గాంతు ॥పురంధ॥

వ॥ పురంధరా నీశరంబు ఖండించి మదీయ బ్రహ్మాస్త్రంబు నీపైక ప్రయోగింపుచున్న వాడను ఇక బ్రతుక జాలవు నీదయాది బాంధవుల దలచుకొమ్ము. (అని బాణం బిడచిన)

ఇం-వ॥ (తనలో) అబ్బ వీనిదెబ్బకు జచ్చి బ్రతికిన చందమయ్యె నా దేహమంత బగ్గుబగ్గున మండుచున్నదే ఇక నేనేమి జేయువాడను వీని పైకి నేనెన్ని భాణంబులు విడచినను వాటి నన్నిటను చూర్ణంబు జేయు చున్నవాడే సరి ఇంకా వీనికెంత బలంబుగలదో చూచెదగాక (ప్రకాశముగా) ఒరే దానవ.

ఇం॥ శంఖచూడ యీ శరము । నీ । దుంకులెల్ల మాన్పివేయు చూడుము ॥శం॥ మంకు ధానవేంద్ర వీవు నన్నిక । మాటిమాటికీని ద్రుంతు నంచును । దుంకుచుంటివి శరంబుఇదో నీ । మంకు భాపు ॥

వ॥ ఒరే రక్కసి ఈ రణంబున గెల్వలేనని నీవు నాపాదంబులపై వ్రాలిన గానీ నిన్ను విడువక ద్రుంచువాడను ఇదో నీపైకి గరుడాస్త్రంబు ప్రయోగింపుచున్న వాడను యిక నీతల్లి దండ్రులక దలంచు కొమ్ము.

శం॥ భింక మొందకుర । ఇంద్రా । నా । బాణము వచ్చె నీ ప్రాణము దీయును ॥భిం॥ పొంకమైన అంబారిప్యాటశ్రీ । ఓంకరేశు డడ్డపడిన గానీ । సుంకుబాపి స్వర్గమేలు దింతలో । చూడుమికను । నేడు యికను ॥బింక॥

వ॥ పురంధరా నీగరుడాస్త్రంబు ఖండించి మదీయ నగ్ని భాణంబు నీపైకి విసరుచున్న వాడను చూడు చూడుము.

సం-వ॥ అని శంఖచూడుడు ఇంద్రునిపై నగ్ని బాణంబిడచిన ఇంద్రుడు పారిపోయ్యెన శంఖచూడుడు శత్రుఘునిగని.

శం-వ॥ మన్త్రిఖా అమరావళి శంఖచూడుండు ఇంద్రాది దేవతల నోడించి స్వర్గంబు పాలింపుచున్నవాడని ఈ పదునాల్గు జగంబులందుగల దేవమానవ ధానవులకెల్లరకు పత్రికలు బంపించుము.

మ-వ॥ చిత్తము అట్టులనే పంపించువాడగాని మన నిజస్థలంబు నకు బోయి వత్తము పదుండు.

శం-వ॥ సరి మంచిది పదుండు.

సం-వ॥ అని శంఖచూడు డమరావళికేగిన ఇంద్రుడు.

ఇంద్రుని - దర్వు - రూపకము. (తరుజు - అయోధ్య దిక్కే - దేతలి)

ఏమిా సేయుదునూ । యెటుదోచదాయె నాకుదిక్కెవ్వరేమి సేయు ॥ యేమిసేతు యెందుబోదు । యేయుపాయమును వహింతు । అమరనాథునీ వధించు । వార్తలు యెవ్వరి ధరలో । పామరు నెట్లు జయింతును ॥ఏమిా॥ పెక్కు రక్కసులా । ముసు । స్రుక్కడంచి యుంటిగాని ॥పె॥ యిక్కాలము వీనిదృంచు వీరులెవ్వరీ ధరలో । చక్కని నా స్వర్గమిడచి । యెక్కడి కేగుదు యింతలో । చిక్కుల బడితిని యికనే ॥నేమి॥ వారిజాసనుడూ । వర మొందుకిచ్చె వానికిట్లు ॥వారి॥ సురలకు రారాజునయ్యె । క్రూర భానవులకు వెరచి । పారిపొయ్యే సమయమచ్చె । కారణ మేమిదో యికనా । కలనైనను దెల్యనుహా ॥యేమి॥ మోసమూయెగా । ఈ సమయము వీనితో బహు ॥మోస॥ భాసుర అంబారిప్యాట । వాసవాశ్చ్యతా యికనే। జేసిన నేరము క్షమించి । ఈసమయంబున నాకము । యిప్పించగరావే హారి ॥ఏమిా॥

వ॥ హా శ్రీహారీ యిక నేనేమి సేయువాడను,

సం-వ॥ అని చిన్నంబోయి నున్నంతలో నారదుడువచ్చె.

నా-వ॥ నారాయణం,

ఇం-వ॥ నారధా నీకిదో నమస్కరింపుచున్నవాడను కటాక్షించుము.

నా-వ॥ పురంధరా వర్ధిల్లుముగానీ నీవిచ్చోట కిన్నుండవై దాగి యున్న కారణంబేమి.

వాదం - ఆటతాళం. (తరుజు - జననిదో వినుమా నీత)

ఇం॥ ఏమని యందు । నా । కెటుదోచదాయె నేడు ॥ఏమ॥ అమరనాథునిం దెల్యగ వశము గాక పారివచ్చి । స్వామిా నేనిచ్చోట । సంశయ మొందుచు నుంటిని ॥ఏమ॥

వ॥ నారదా యూశంఖచూడ ధానవేంద్రుడు వేయు శరముల కేగ లేక బహు తొందర పాటున పారివచ్చి ఇచ్చోట దాగియుంటిని కావున అట్టి దుర్మార్గుని దృంచెటి వీరులెందైనగలరేమొ తెల్పుడు మీారు జేసిన మేలు యేనెన్నటికిని మరువలేను వింటిరా,

నార॥ యిందుకె యింతా । బహు । తొందర పడుచుంటివ నీ ॥విందు॥ సందియమేలను విను యూ । శంఖచూడు నింతలోన । ఇందిర వరదుడె దృంచును । యిపుడే వైకుంఠమేగు ॥యిం॥

వ॥ యింద్రా నీవింతలో వైకుంఠంబున కేగి లక్ష్మీరమణునకీ విధం బంత దెల్పిన అట్టి ఘనుండు యద్దానవున్ని ద్రుంచి నీపురంబు నీకిప్పించును నామాట నమ్ము ము.

ఇం॥ ఎంచగవాన్ని । హరి । ద్రుంచునో లేదో కద యిక ॥యెం॥ సంచిత
ముగ పూర్వమతని । సేవకుడగు సుధాముం । డంచును తాదెలుసు
కొని వి । రించియు యేమనునో కద ॥ఎం॥

వ॥ కావున మున్ను అతడు మాభక్తుండే యని పల్కునేమో యని అనుమానింపుచున్న వాడను.

నార॥ ధానవులెల్లా । యా । ధశవేశుని వైరులెకద ॥ధా॥ గాన నీవు
యింతలోన । అనుమానించక జనినా । పనిభూని అంబారిప్యాట
ఇనవంశోత్తముడె బోచు ॥ధాన॥

వ॥ పురంధరా ఇంతలో నీవు వైకుంఠవాసునింజేరి శరణు బొందిన తప్పగ వాన్ని ద్రుంచును ఇక నేవచ్చి చాల నాలస్యంబాయెను యిదే నే సత్యలోకంబున కేగుచున్న వాడను. (అని నిమిష్క్రమించిన పరుద్రవాలును)

వైకుంఠంబున లక్ష్మీనారాయణుండు – వాదం
ఏకతాళం (తరుజు – ఆనందము మదిగలిగెనుగా)

లక్ష్మీ॥ రమణీ రమణా । ప్రేమిసఖా । రయమున లేచితి రెందుకికా ॥రమ॥
నీమది కలగన్నది యెటువంటిదో । వింతలో దాచక దెల్పుడికా ॥

వ॥ నాధా నీరేమొ నిద్రనుండి దిగ్గునలేచి కూర్చుండి యుంటి రేమి కారణం కలగంటిరా యేమి.

విష్ణు॥ రమణీ మిణి యదో । చూడుమికా । రాక్షసులా బాధాలకికా ॥
రమ॥ సామజ యానరో । సురలు మునులు మన । స్వగృహమున
కే తెంచిరికా ॥రమ॥

వ॥ కాంతామణి దేవధానవ వైరంబుంగలిగి సురలు మన మంది రంబున కేతెంచుచున్న వారదో కనుంగొనుము.

లక్ష్మీ॥ ఎందుకొరకు సురలూ ధనుజుల్ । సుందరాంగ పోట్లాడిరి భల్ ॥
ఎం॥ సందేహించక మీరలు నాకది । పొందుగ దెల్పిన । విందును
భల్ ॥ఎందు॥

వ॥ ప్రాణవల్లభా దేవదానవుల కెందుకు వైరముగలిగెనో సవిస్తార మంత వినంజేయుడని కోరుచున్న దాన.

విష్ణు॥ సుందరి యేమని తెల్పుదికా । సుధాముని చరితంబునికా ॥సు॥
అందముగను అంబారిప్యాట శ్రీ । ఇందిరేశ్వరుడనయ్యా సుఖా ॥
వ॥ కావున మున్ను తమ వారలకు జేసిన యనుచితంబు శంఖ చూడుండు యాలించి స్వర్గంబునకు వరూధినితోజని ఇంద్రాదిదేవతల నోడించి స్వర్గంబు పాలింపుచున్నందున దేవతలు నన్ను ధ్యానింపుచున్న అట్టి ధ్వని విని ద్విగుణతేచితిని వింటివా లక్ష్మీ. (అంతలో నారదుడు)
నా-దరువు॥ మాధవ మధుసూధనా । నమోనమో ॥మా॥ రాధా కరుణా ।
మాధవ సుగుణా । రాధవినోద లక్ష్మీరమణా ॥మాధ॥
వ॥ నారాయణా నమోన్నమ. (అని విష్ణువునుగని, శ్రీహరి మీకిదో నమస్కరించెద కటాక్షించుడు.
విష్ణు-వ॥ నారదా వర్ధిల్లుముగాని ఈ ముల్లోకంబునంగల వారికెల్ల రకు క్షేమమేనా.
నా-వ॥ అంత క్షేమంగనేయున్నవారుగాని అదో దేవేంద్రుడు తమ వద్దికి విచ్చేయుచున్నవాడు కనుండు.

ఇంద్రుడు - దరువు - ఏకతాళం

మురహార నామొర వినుమా । మొర వినుమా । దయగనుమా ॥
ము॥ నేరమేమి నేరను నన్నేలను నీభారము హారి ॥మురా॥ ధరపైనొక శంఖచూడ । ధానవేంద్రుడనువాడును । వైరము నాపై దలచియు । వాహనముల్ గొని పోయెను ॥మురా॥ యోచన జేయుద మన్నను । తోచదాయె నామదికిని ॥యో॥ సచితానంద స్వరూప । స్వామీ నాగతి నీవె ॥
ము॥ భాసుర అంబారిప్యాట । దాసపోష దయవిశేష । ఈసమయము ఇంద్ర స్వర్గ । మిప్పించగదే శ్రీశా ॥మురా॥

సీ॥ అష్టమూర్తులచేత నఖిల ప్రపంచంబు ♦ విభవించి ధరియించి వెలసినావు ♦
కష్టంబులొంది స్మరణ గాంచి మమ్ముగ ♦ రక్షించి ప్రేమించి యేలినావు ♦ పంచ కృత్యముల నేర్పరచి రచించుచు ♦ సరియొక్కరును లేక సాకినావు ♦ సచ్చితానందల క్షణుడవై ఘనుడవై ♦ నిరాకారుండవై నెగడినావు ॥ గీ॥ సత్యరూప ప్రభూ ప్రాజ్ఞ సన్నిధాన ♦ విబుధనాయక విశ్వేశ వేదవేద్య ♦ దీనబంధు దయాసింధు దృతనవేంద్ర ♦ శరభమూర్తి నళినజాండ చక్రవర్తి ॥

వ॥ స్వామీ సచిదానంద స్వరూప మీపాదంబులకిదో ప్రణమిల్లు చున్నవాడను నన్నాదరించుము.

ఐ-వ॥ స్వర్గనాయక వర్ధిల్లుము గానీ నీవిచ్చోటికి అడలుచు విచ్చే సిన కారణంబేమొ సవిస్తారమంత చక్కగా వచించుము.

వాదం - (తరుజ - అమ్మా అమ్మా ఆడుకొనగ)

ఇం॥ నరహరీ మురహరీ । నాపునవియు నీకనుయిం కేరీతివచ్చుదునక

నర॥ సారసాక్ష నేడు శంఖచూడుడు స్వర్గమున కేగి । సిరలుంజార గొనియును మరినాకముగొని పోయెను ॥నర॥

వ॥ లక్ష్మీరమణ యా శంఖచూడుండు మమ్మోడించి మదీయసిరు లుంజారంగొని స్వర్గంబేలుచున్నవాడు. కావున వాన్ని వధించి మాసామ్రా జ్యము మాకిప్పించుడని వేడుచున్నవాడను.(అంతలో లక్ష్మి ఇంద్రునిగని)

లక్ష్మి॥ పాపము దోషము । మా భక్తుని వధియించుట. మరియాదయు గాదిక విను ॥పాప॥ ప్రాపుగ పదునాల్గుజగము । బ్రహ్మాడశక్తిగల దతనికి ఈపట్లవాన్ని గెల్వ । నీతరమా హరి తరమా ॥పాప॥

గీ॥ మదిని సర్వాంబరసిదివ్య మండలికను।వినుడు సుపర్వవరులాతడు మదీయం భక్తవర్యుండు గోలోక వాసిరాద । శాపనశంబున నసురయై జనన మొందె ॥

వ॥ కావున ఇప్పుడతన్ని వధించుట మహాపాతకంబుగాదా ఏలా యీ మాటలు యూరికె మరళిపొమ్ము (అని నారదునివంకజూచి) నారదా వింటివా ఈ యింద్రుని చాడిమాటలు.

నా-వ॥ ఔనులక్ష్మి నీవన్నమాట నిజమె అది ఎటులన్నను మున్ను రామావతారమందెయ్యాతిని పధించుమని విశ్వామిత్రుండిట్లే చాడిమాటలు జెప్పి రామాంజనేయులకు సమరంబుగల్పించెను కావున తమ భక్తులను కన్నకుమారులవలె జూడవలయును గాని ఖండింపంగదు అట్లు ఖండించిన పాతకమా మహాగొప్పపాతకమనంబడును.(అంతలో ఇంద్రుడు విష్ణువునుగని)

ఇం॥ మాధవా యాదవా । నాధారము లేని వాడనైతిని యింకెటుబోదును॥

మా॥ శ్రీధర శంఖాచూడుని । శిక్షజేసివారలెవరు నీదయ నాపై నుంచియు । నిగమాంతకనన్నేలుమి ॥మా॥

ఉ॥ ఏదియుపాయమిందు మకు । నెట్టులసాకదలంచుమయ్యదా
మోదరనీవుగాక మరి । యెక్కడికేగుదు మాకుదిక్కునీ
వాదటజిత్తమందుగడు । నారసిమేలగు నట్టిమార్గముం
శ్రీధరయుక్తిదెల్పుమది । శీఘ్రముపూని నొనర్తు మిత్తరిం ॥

వ॥ జనార్ధనా నీవుగాక మాకింకెవ్వరు దిక్కునాయెడ కరుణించినన్ను కడతేర్చ యుపాయంబూహింపుము దేవాలోకరక్షకుడ వీవుగావా.

విష్ణు॥ వినుమికా జనుమికా । ఇంతలో ఈశ్వరునికడకు అనుమానించక
నీవును ॥వి॥ ఘనబలుడగు శంకరుండు । ధనుజులతో బోరాడియు
రణమందున నోడించియు । రాజ్యంబును ఇప్పించును ॥విను॥

వ॥ యింద్రా నీవిప్పుడే ఈశ్వరునికడ కేగుము అట్టి ఘనుండు దానవుల మెప్పించిగాని లేక రణంబుంజేసిగాని మీ స్వరాజ్యము మీకిప్పించును నామాట నమ్ముము.

ఇం॥ స్వామికా యేమికా । సేయువాడ తుదకును నానోము ఫలము యెటు
లున్నదో ॥స్వామి॥ యా మహేశ్వరుండు తాను । ఏమని పల్కునో
యిప్పుడు నామదికెటు దోచదాయె । నరహరి మదిగుందనాయె ॥

వ॥ శ్రీహరీ మీచే కాని కార్యము ఈశ్వరునిచే యౌనా యుబద్ధము యిక నాగతి యేమౌనో తెల్యదు.

విష్ణు॥ నమ్మికా పొమ్మి । ఇమ్మహా అంబారిప్యాట ఈశ్వరునికడ కిప్పుడు ॥
నమ్మి॥ సమ్మతించి స్వరాజ్యం । స్వర్గనాయకా నీకును మునుమ్మాటి
కిప్పించును । ముదముస నీవందేగుము ॥నమ్మి॥

మ॥ మరియుం వాడు భుజాబలంబునందపో । మహాత్మ్యముం జేసియే
వ్వరికిం జవ్వను లోగడుత్తమ బలప్రా । వీణ్యా తేజో పురం
ధరడవ్వానిహరుండు శూలహాతితో । తాదృంచు నీవిప్పుడు
సరగుణనేగుదెమ్ము శివుండున్న । సన్నిధికింతలోనం ॥

వ॥ కావున అట్టి శంఖచూడుని శంకరుండు త్రిశూలముచే గూలన్నేసి స్వరాజ్యము నీకిప్పించును నామాటనమ్మి నీవీతక్షణంబున కైలాసంబున కేగుము. నీకిదియే సెలవు.

ఇం-వ॥ చిత్తము శ్రీహరీ యిదేనె కైలాసంబున కేగుచున్నవాడను.

సం-వ॥ అని నిష్క్రమించిన పరుడ ద్రవాలును.

---

# పంచమాశ్వాసము

## కైలాసము.

—(పార్వతి - పరమేశ్వరుల - ప్రవేశం - దర్వు - ఏకతాళం)—

ప్ర॥ శంభుడను నిపరా । త్రినేత్ర త్రిశూలపాణినిరా ॥త్రినే॥ గంభీరమున భువ । నంబులు యేలేటి సాంభమూర్తినిరా । నేజగాధాంభసఖుడనురా ॥నే॥శం॥ అమదినమునన్నూ గొలచినా । వారికిని మున్నూ॥ పసిభూనియు నే ప్రత్యేక్షం బై । పాలనజేసెదను భక్తులా మనమునిల్పెదరు ॥భ శం॥ పంకజాక్షునకు సఖుడనై పదవి నేలుటకు ॥స॥ పొంకమైన అంబారిప్యాటలో । ఓంకారేశుడనై వెలసితీ లింగాకారుడనై ॥వెల॥

వ॥ చిత్రరథా ఈ పదునాల్గు జగంబులందుగల దేవధాన మానవులెల్ల భోళాశంకరుండని నన్ను గొలయాడుచున్న వారలేనా తెల్పుము.

చి-వ॥ శంకరా పాపభయంకర ఈ పదునాల్గు జగంబులందుగల ఎనుబదినాల్గులక్షల జీవకోటులెల్ల తమనేపూజింపుచున్నవారు స్వామి.

పార్వతి - దర్వు - ఏకతాళం (గర్గదరామరుదా)

పార్వ॥ అంబికాయనినన్ బిలతురీ కుంభినీలోనన్ ॥బిల॥ సంభరమున యీ సర్వేశ్వరునకు । శాంభవినైయుంటిన్ ।సతినిప్రియా శాంకరినై యుంటిన్ ॥సతి॥అంభి॥ భూలోకమునందు కాళికనీ । గొలచెరు నన్మందు ॥కా॥ చాలగనను పూజించిన జనులకు । మేలొసంగితినీ భక్తులా బాధలుమాన్పితిని ॥భ॥అం॥ ధరణి అంబారిప్యాటనీ ధాము నికగోరీ ॥ప్యా॥ ఆరూడిగ రాజాఖ్యుని కవికిని । వగుసలు దెల్పితినీ। చక్కనీ వాక్యములిచ్చితినీ ॥చ॥

వ॥ చిత్రరథా ఈ ముజ్జెగంబులందుగల సకల సురులు నరులు నన్నే పూజింపుచున్న వారలేనా తెల్పుము నేవిని సంతోషించెద.

చి-వ॥ జగజ్జెననీ జగదాంబ సకల సురులు నరులు నిన్నేపూజింపుచున్నవారుగానీ అదో త్రిలోకసంచారియగు నారదమహాఋషుల వారి చోటికి విచ్చేయుచున్నవారు కనుంగొనుడు.

—(నారదుడు - దరువు - ఏకతాళం)—

నార॥ జయజయ శంకర । జయవిశ్వేశ్వర జయసర్వేశా జయసర్వాగత ॥
జయ॥ జయకాళికపతి॥ జయప్రకృతేశా భయవిహిత శ్రీ । బాలెందు
ధరా ॥జయ॥ కావగరావే గణపతిలోలా । బ్రోవగలేవే మునిజన
పాలా ఈవేశరణం । భిక్షగను మాత్మ్రక్ పావనమూర్తి ॥జయ॥
ధాణి శ్రీ అంబారిప్యాటని । హాయుడవుగావే ఘనుడవునీవే । పార్వతి
లోలా పరమదయాళా పరమకృపానిధి పాలనజేయుము ॥జయ॥

వ॥ నంధివాహనా నమస్కారము.

పర-వ॥ నారదా ప్రతి నమస్కారము గానీ నీవిచ్చోటికి జహుతొం
దరగా నిచ్చేసిన గారణంబేమి.

నా-వ॥ తొందరేమి యాసతీతులసి పతివ్రిత ప్రితిజ్ఞవలన శంఖ
నూడుండు ఇంద్రాది దేవతల నోడించి స్వర్గంబు వానిస్వాధీనము జేసు
కొని ఏలుచున్నవాడు అహా అట్టి తులసి పతివ్రత్యంబింని చెప్పరాదుగద.

సం-వ॥ అంతలో పార్వతి నారదునిగని కోపముతో.

పా-వ॥ నారదా మానుందర యాకిం చెత్తులసిని ఇంత పెంపుజేయు
చుంటివా యాపురంధరునకా శంఖచూడుండనెంత చాలుచాలు ఇట్టి మాట
లన్ని గట్టిపెట్టి నోరుమూయుము.

నా-వ॥ ఓహో పార్వతీ అలనాడు అనసూయ పతివ్రత్యంబువలన
చిక్కులబడినది నీవింతలోనే మరచితివా.

పా-వ॥ అప్పటి సమయంబెప్పటికి రాదని కలలోనమ్మకొనుము.
(అంతలో ఇంద్రుడువచ్చి ఈశ్వరునిగాంచి)

ఇం-కం॥ ఏలుము మము. నసురను నిర్మూలము జేయుము గడంగి ముగ్ధేందు
ధరా । జాలముజేసిన బ్రితుకక్ । జాలముదయజేయుమికను సత్వా
రమున మదిక్ ॥

వ॥ శంకరా పాపభయంకర మీపాదంబులకిదో ప్రిణమిల్లుచున్న
వాడను కటాక్షించి నన్నాదరించుము.

పర-వ॥ పురంధరా వర్ధిల్లుము గానీ నీవిచ్చోటికి విచ్చేసిన కారణం
బేమో స్ఫుటపరచుము తత్కార్యము నెరవేర్చువాడ.

దర్బా - ఏక తాళం (తిరుజు కమలనయనా బ్రోవ)

ఇ॥ ఈశ్వరా జగదీశ్వరా పర । మేశ్వరా శ్రీశాగిరీశా ॥ఈ॥ శాశ్వతంబుగ వేడితిని వి । శ్వాసముంచుమిదె శా గిరీశా ॥ఈ॥ నందివాహన నాగ భూషణ । నాగతీసీవేగిరీశా సంధియంబును బాపి నన్నిక । సాకుమీ యిపుడుక గిరీశా ॥ఈ॥ ఘనుడు శంఖాసురాడుడూ మాను । కటకటా బరచీగిరీశా భూణముల్ విడ నొచ్చినచ్చియు । బ్రతికివచ్చితిగాగిరీశా॥ ఈ॥ మాదునాకము మాకు యిమ్మన । మమ్మెగొట్టెనుగా గిరీశా ఎదురుమెవ్వరు లేరు నాకస । ఎగురుచున్నడుగా గిరీశా ॥ఈ॥ వాంఛ నుగు అంబారిష్వాట ఓంక రేశునవేగిరీశా । సంకటంబులు బాపెదా వం శరణుజొచ్చితిగా గిరీశా ॥ఈ॥

వ॥ పరమేశ్వరా యుద్ధానవుండు స్వర్గంబుచేకొని మాకిన్ని కష్టంబులు గల్పించిన అట్టి బాధలకోర్వలేక నీవద్దికి వచ్చియున్న వాడను కావున నాదీనోక్తులాలకించి నన్నాదరించుము.

వాదం - రూపకము (తగుజు నమ్మనమ్మ నావశ్యమ్మ)

పర॥ చింతనొందవలదూ యింద్ర ॥చి॥ యింతలో దైర్యమునొందుము ॥చిం॥ శాంతముచే స్వరాజ్యం । బింతలో నీకును యిమ్మని సంతసమున వ్రతంబును । శంఖాసురాడుకు వ్రాసెద ॥చింత॥

వ॥ ఇంద్రా యింతలో శంఖాసురాడుని శాంతముచే స్వరాజ్యం బివ్వమని చిత్రరథునితో పత్రము వ్రాసిపంపెదగాని నీవు దైర్యంబునొందుము.

ఇం॥ సంతసమున స్వారాజ్యము ॥సం॥ ఇంతలో యివ్వడు చూడుడి ॥సం॥ మంతనమున వాడెంతో మధహంకారముచే శ్రీ । కాంతుడు వచ్చిన చెరువని । గంతులు వేయుచునున్నడు ॥సంత॥

వ॥ ఈశ్వరా వాడు స్వరాజ్యంబిచ్చుటకు నాకెంతమాత్రము నమ్మకమనిపించదు కావున తాము నాకభయంబిచ్చిన నామది నిజమని నమ్మెదను.

పర॥ అటులయివ్వకున్నా వానీ । తటకున మర్ధించెద విను ॥అ॥ భూటక మాటలు గావిక । భూరిగ త్రిశూలముచే కుటిలాత్మునిబట్టియు నే గూలన్నేసెద చూడుము ॥అ॥

వ॥ కావున మంచిమాటలచే యివ్వకున్న యుద్ధరాత్మని ద్రుంచి స్వర్గంబు నీకిప్పించెద ఏదో అభయంబుచేకొని చింతమానుము.

ఇం॥ ఏటికి నాకింకా చింతా । దిటలాతుడు రుండగ ॥ఏ॥ పాటిగ శ్రీ అంబారీ । ప్యాట నివాసుడవని ముమ్మాటికి దలచెద శివనిసాటెవ్వగు లేరని మది ॥ఏటి॥

వ॥ అహాహా శంకరా మీదయాలు త్ర బింతని చెప్పరాదు ఇప్పుడు గదా నామనంబానందంబాయెను యిక నీ చెంతనే యుండువాడను.

పర-వ॥ చిత్రరథా.

చి-వ॥ పరమేశ్వర యేమియాజ్ఞ.

వాడం - (చెన్నుగనిటు వినర ఇంద్రజిత)

పర॥ ఖ్యాతిగనిటు వినర చిత్రి । రథనీ కదిదెల్పెదా ॥ఖా॥ భీతిపడక అమరావతి । బొమ్మిక మిదిమెచ్చెదా ॥ఖ్యాతి॥

చ॥ ధరపయి శంఖచూడుడను । ధానవుడున్న పురంబుజొచ్చియా
సురరిపుతోశ నానుడిగ । సూటిగనిట్లును పోటుబంటవై
వెరువక దివ్యవర్యులను । వీగగజేసి తదీయమాసిరిన్
బురమును జారగొంటివిది । పొలదువారల కిమ్మన్నాకమున్ ॥

వ॥ కావున నీవిప్పుడే అమరావతికింజని శంఖచూడునకీ పత్రింబొసంగి రావలయును వింటివా.

చి॥ శంకర మీరను విధంబె । శంఖచూడునకడకునూ ॥శం॥ జంకుపడక పత్రిమిచ్చి । జయముగొనియు వత్తును ॥శంక॥

వ॥ ఈశ్వరా మీరలాజ్ఞాపించిన విధంబే శంచూడునకీ పత్రింబిచ్చి వచ్చెద సెలవొసంగుడు.

పర॥ ఇంకొన్ని పల్కులు నే । విన్నవింతు వినుమికా ॥ఇం॥ రంకుతనము మానియు స్వా । రాజ్యము ఇమ్మనుమికా ॥ఇం॥

వ॥ చిత్రరథా మంచిమాటలచే ఇచ్చెనా సరె ఇవ్వకున్న రణంబున గూలంన్జేసి అదితేజులకు అమర స్వర్గంబుంజేతునన్నడని వచించిరా పొమ్ము నీకిదియే సెలవు.

చి॥ ఈశ్వర మీరనా విధంబె । యీవివరము దెల్పెదా ॥ఈ॥ శాశ్వత అంబారిప్యాట । శంభుడవని నమ్మెదా ॥ఈశ్వ॥

వ॥ మహేశ్వరా ఇదే నేబోవుచున్నవాడను. (అని చిత్రరథుడు అమరావతికేగి శంఖచూడుని గని.)

చి. వ॥ హే శంఖచూడ దానవేంద్ర యిదో పత్రంబు చేకొనుము.

శం-వ॥ అని పత్రమిచ్చిన శంఖచూడు చదువుకొని.

వాదం - ఏకతాళం - తరుజు (నీవెవ్వోడాపందు నిల్వుమా)

శం॥ ఎవ్వాగునీకు యీ పత్రము। లేఖ। యించిఇచ్చిరో తెల్పు నిక్కము॥

ఎ॥ నువ్వుండు పురమేదో। నీరాజు పేరేమి సవిధంబు దెల్పునింద।

నయముగాను దెలుసుకుందు ॥ఎవ్వా॥

కం॥ ఏదేశమే నివాసము। భూదేవకులా వతంస పొందుగనిటుమా। కాదే

శింపుము సనుగన। శ్రీధనదునిగాంచినట్లు చిత్తంబలరెన్॥

వ॥ కావున నీవెవ్వరి భూతవు నీరాజు నామాంకితమేమో శీఘ్రంబునం దెల్పుము.

చి॥ పశుపాతి నీకు యీ పత్రమూ।వ్రాసి।పంపెను విను యీదినిక్కమూ॥

ప॥ ఆశించిన విందుతోసీ తెచ్చినదంత। రేశమొందబోక యిపుడు।

ఈశుడు యిమ్మాని తెల్పె ॥పశు॥

చ॥ హరుడిటు జెప్పిపంపె వినుమా। యసురోత్తమ దివ్యపర్వ్యలం

దరి గదనంబునన్ గెలచి। తద్ధనవాహన వస్తువర్గముల్

బురమును రాజ్యమున్ బడసి। పొంగుచునుంటివి చెల్లదింక స

త్వరముగ వారి సర్వమును। వారలకిచ్చి మనంగజూడుమా॥

వ॥ కావున హరుండిట్లుజెప్పి పంపుతె వచ్చినవాడను ఏను చిత్రరథుండను వింటివా.

శం॥ నాయందు నాదాడి దలపగా। విధి। న్యాయంబ శివునకు యోచింపగా ॥నా॥ రాయభారము యిపుడు। జేయుగాను వానికయ్యె భయమదేల రణముజేసి। జయముగొందు యింతలోన ॥నాయ॥

గీ॥ చనునెతనజోలిసుంతయే జాడనేని। దలపకున్నట్టినా మొక దాడిదలప।

హరునకిది నాయమౌనో కోయనుచితంబు। గాదొకోనీవు యోచింపు

కౌశలమున॥

వ॥ చిత్రరథా శివుండందరి నొక్కసమానము జూడక పక్షపాతమండై ఇంద్రునకు సహాయమయ్యెయున్నవాడ సరి స్వరాజ్యంబాది తేజులకివ్వకున్న శంకరుండు నన్నేమి జేయగలడో చూచెదగాక.

వ॥ కావున మంచిమాటలచే యివ్వకున్న యుద్ధురాత్ముని ద్రుంచి స్వర్గంబు నీకిప్పించెద ఏదో అభయంబుచేకొని చింతమానుము.

ఇం॥ ఏటికి నాకింకా చింతా । దిటలాతుడు రుండగ ॥ఏ॥ పాటిగ శ్రీ అంబారీ । ప్యాట నివాసుడవని ముమ్మాటికి దలచెద శివనీసాటెవ్వరు లేరని మది ॥ఏటి॥

వ॥ అహాహా శంకరా మీదయాలు త్ర చింతని చెప్పరాదు ఇప్పుడు గదా నామనంబానందంబాయెను యిక నీ చెంతనే యుండువాడను.

పర-వ॥ చిత్రరథా.

చి-వ॥ పరమేశ్వర యేమియాజ్ఞ.

వాదం – (చెన్నుగనిటు వినర ఇందజిత)

పర॥ ఖ్యాతిగనిటు వినర చిత్ర । రథనీ కదిదెల్పెదా ॥ఖ్యా॥ భీతిపడక అమరావతి । బొమ్మిక మిదిమెచ్చెదా ॥ఖ్యాతి॥

చ॥ ధరపయి శంఖచూడుడను । దానవుడున్న పురంబుజొచ్చియా
సురరిపుతోడ నానుడిగ । సూటిగనిట్లను పోటుబంటవై
వెరువక దివ్యవర్యులను । వీగగజేసి తదీయమాసిరిక్
బురమును జారగొంటివిది । పొలదువారల కిమ్మిక న్నాకముక్ ॥

వ॥ కావున నీవిప్పుడే అమరావతికింజని శంఖచూడునకీ పత్రింబొసంగి రావలయును వింటివా.

చి॥ శంకర మీరను విధంబె । శంఖచూడునకడకునూ ॥శం॥ జంకుపడక పత్రిమిచ్చి । జయముగొనియు వత్తును ॥శంక॥

వ॥ ఈశ్వరా మీరలాజ్ఞాపించిన విధంబే శంచూడునకీ పత్రింబిచ్చి వచ్చెద సెలవొసంగుడు.

పర॥ ఇకొన్ని పల్కులు నే । విన్నవింతు వినుమికా ॥ఇం॥ రంకుతనము మానియు స్వా । రాజ్యము ఇమ్మనుమికా ॥ఇం॥

వ॥ చిత్రరథా మంచిమాటలచే ఇచ్చెనా సరె ఇవ్వకున్న రణంబున గూలంన్నేసి అదితేజులకు అమర స్వర్గంబుంజేతునన్నడని వచించిరాపొమ్ము నీకిదియే సెలవు.

చి॥ ఈశ్వర మీరనను విదంబె । యీవివరము దెల్పెదా ॥ఈ॥ శాశ్వత అంబారిప్యాట । శంభుడవని నమ్మెదా ॥ఈశ్వ॥

వ॥ మహేశ్వరా ఇదే నేబోవుచున్నవాడను. (అని చిత్రరథుడు అమరావతికేగి శంఖచూడుని గని.)

చి-వ॥ హే శంఖచూడ దానవేంద్ర యిదో పత్రంబు చేకొనుము.

సం-వ॥ అని పత్రమిచ్చిన శంఖచూడు చదువుకొని.

వాదం - ఏకతాళం - తనుజు (నీవెవ్వాడాపందు నిల్వుమా)

శం॥ ఎవ్వాగునీకు యీ పత్రము । లేఖ । యించిఇచ్చిరో తెల్పు నిక్కము ॥

ఎ॥ నువ్వుండు పురమేదో । నీ రాజు పేరేమి సర్విధంబు దెల్పునిందు।

నయముగాను దెలుసుకుందు ॥ఎవ్వా॥

కం॥ ఏదేశమే నివాసము । భూదేవకులావతంస పొందుగనిటుమా । కాదే

శింపుము సనుగన । శ్రీధనదునిగాంచినట్లు చిత్తంబలరెన్ ॥

వ॥ కావున నీవెవ్వరి భూతవు నీరాజు నామాంకితమేమో శీఘ్రంబునం దెల్పుము.

చి॥ పశుపాతి నీకు యీ పత్రమూ।వ్రాసి।పంపెను విను యీదినిక్కమూ ॥

ప॥ ఆశించిన విందుతోనీ తెచ్చినదంత । రేశ మొందబోక యిపుడు ।

ఈశుడు యిమ్మాని తెల్పె ॥పశు॥

చ॥ హరుడిటు జెప్పిపంపె వినుమా । యసురోత్తమ దివ్యపర్వ్యాలం

దరి గదనంబునన్ గెలచి । తద్గనవాహన వస్తువర్గముల్

బురమును రాజ్యముల్ బడసి । పొంగుచునుంటివి చెల్లదింక స

త్వరముగ వారి సర్వమును । వారలకిచ్చి మనంగజూడుమా ॥

వ॥ కావున హరుండిట్లుజెప్పి పంపుతే వచ్చినవాడను ఏను చిత్రరథుండను వింటివా.

శం॥ నాయందు నాదాడి దలపగా । విది । న్యాయంబ శివునకు యోచింపగా ॥నా॥ రాయభారము యిపుడు । జేయుగాను వానికయ్యె భయమదేల రణముజేసి । జయముగొందు యింతలోన ॥నాయ॥

గీ॥ చనునెతనజోలిసుంతయే జాడనేని । దలపకున్నట్టినా మొన దాడిదలప ।

హరునకిది నాయమౌనా కోయనుచితంబు । గాదో కోనీవు యోచింపు

కౌశలమున ॥

వ॥ చిత్రరథా శివుండందరి నొక్క-సమానము జూడక పక్షపాతకుండై ఇంద్రునకు సహాయమయ్యెయున్నవాడ సరి స్వరాజ్యంబాది తేజులకివ్వకున్న శంకరుండు నన్నేమి జేయగలడో చూచెదగాక.

చి॥ దానవేంద్రివారి విభవమెల్లనూ ।యివ్వ। కున్న నిన్ను తెగటార్తునని యెనూ ॥ధాన॥ కానిపో నిమాటలేల । ప్రాణములకుభీతినొంది నీనివాస పురమునందు । నీవును మెలంగుమింక ॥ధాన॥

గీ॥ అట్లుజేయక దక్కిన యసురనిన్ను । వేగతెటార్చియువ్వారి విభవమెల్ల వారికిచ్చెదా హెచ్చులు వలదు దుడుగు । మనియెనీయుల్లమెట్లులో యరచి చెపుమా ॥

వ॥ వింటివా ఇట్లు పురంధరున కరునకరుండభయంబు బొసంగెను కావున నీయుల్లమందెట్టుగలదో వచింపుము.

శం॥ భీతినొందెవాడయేను గాననీ । చిత్ర । రథయిట్లు దెల్పు శివునితో నీ॥ భీ॥ ఖ్యాతిగాను సురలు మేము । జ్ఞాతులాము పోరుచుండ యితడు మాకు నడ్డమచ్చి ॥ నీతిజెప్పవిందు మెట్లు ।భీతి॥

కం॥ ఏదో రీతిగ మాదా । యాదులు దివదులుమేము ననోన్యన్యంబుల్ । వాదొనరింతుము గలియుదు। మేదైనను లేదు పరులకిటు పనిమొకదుల్ ॥

వ॥ శివదూతా వింటివా దేవతలు మేము పాలివారలము కావున కలహములు మాత్రిము మాకెప్పటికి గలిగియేయున్నవి ఇందులకు ఈశ్వరుండు అడ్డపడిన భీతినొందీ స్వరాజ్యంబాది తేజులకిస్వనన్నడని మీశివునితో వచించుము.

చి॥ ధీరుండు శంభునితో నీవునూ । యిక । బోరాడలేవు శరణుబొందుము॥ దీరు॥ కరుణించి నిన్నింతో । గారావించునింక ధారుణి అంబారిప్యాట। ధాముని తో వైరమేల ॥ధీరు॥

వ॥ శంఖచూడ వట్టిగ రట్టుపాలయ్యె ప్రాణంబులు బోగొట్టుకునేద వెందులకు అట్టి ఈశ్వరునకు శరణుబొందుము లేకయున్న యుద్ధంబునకు దండెత్తివచ్చి నిన్ను బరిమార్చును నామాటనమ్ముము.

శం-వ॥ చిత్రరథా ఆ ఈశ్వరుండు దండెత్తివచ్చినను యేనుకూడ యుద్ధంబునకు సన్నద్ధుండనై యున్నవాడను ఇక నీకిదియే సెలవు పొమ్ము.

సం-వ॥ అని శంఖచూడు నిష్క్రమించిన చిత్రరథుండు కైలాసంబు నకుంజని శివునిగాంచి యిట్లనియె.

చి-వ॥ ఈశ్వరా మీకిదొ నమస్కరింపుచున్నవాడను కటాక్షించుడు.

పర-వ॥ చిత్రరథా వర్ధిల్లుము వర్ధిల్లుము.

వాదం - ఏకతాళం (తరుజు - నారదా మహారాజా)

పర॥ ఏమి సమచారమో । నేమించి చిత్రరథ తెల్పుమా ॥ఏ॥ కాము కాయ ముచ్చటలను । కాంతుతోను విందు నేడు । నీమదిలో దాచకాను । నిక్కముగను నుడువువేగ ॥ఏమి॥

వ॥ చిత్రరథా నీవు గొనితెచ్చిన సమాచారమెట్టిదో శీఘ్రంబున వాక్రుణించుము.

చిత్ర॥ స్వామి నేనేమనీ । యీ ముచ్చటా నీతో దెల్పుదు ॥స్వా॥ కామ క్రోధుడయ్యె వాడు । కన్నుగాన కుండనున్న । ఏమి యేమొ మాటలంచు । ఎగురుచున్నవాడు యింక ॥స్వామి॥

వ॥ శంకరా మీరు వ్రాసిన పత్రము చదువుకొని హరిహర బ్రహ్మాదులు దండెత్తి వచ్చినను ఆది తేజులకు స్వరాజ్యం బొసంగ నన్నడని మీ శివునితో ఎచింపుమని తెల్పెను వింటిరా.

పర॥ ఇంత కావరమా । దృంతూను నూడు దుర్మార్గునీ ॥ఇం॥ ఎంత బలము గలదో వాని । కెవ్వరడ్డము చెప్పెదారో । పంతగించి యిప్పుడు నాదు । ప్రతాపంబు జూపుదును ॥ఇంత॥

సీ॥ భైరవుండును వీరభద్రుండు సమ్మహా ♦ సేనుండు గంధగజాస నుండు ♦ చండీశ్వరుండు బాష్కలుడును మణిమంతు ♦ నందియాగ శని మహాబలుండు ♦ కంకల కోకిల శంకు కర్ణులును సం ♦ తాన కపిప్పల భానుకులును ♦ కపిలజటీచరా కాలజిహ్వులును ఘంటీ ♦ భద్ర దుర్జయు కాక పాదనీలు॥ గీ॥ లగ్ని కాగ్ని ముఖ్యులీడు లల్లపూర్ణ ♦ భద్ర విక్రృత విశాఖ సంసర్ధకులును ♦ చంద్ర తాపస లకుపీశ సన్నిధులను ♦ యుద్ధమునకు సన్నద్ధులైయుండుమనుమా॥

వ॥ చిత్రరథా వింటివా నీవీ తక్షణంబున భైరవ వీరభద్ర సమ్మహా సేను జానుబాను బాష్కలు మణిమంతు భద్ర దుర్జయు శంక కర్ణా చండీశ్వరు కాలజిహ్వ లల్లపూర్ణ విక్రృతి విశాఖ సంసర్గకు లాదిగాని సకల నానాయుధంబులతో యుద్ధంబునకు తయారు గమ్మని యాజ్ఞాపించుము ఆలస్యంబు వలదు.

చిత్రి॥ శ్రీకర దయాకరా । శీఘ్రంబు నా మన సైన్యముల్ ॥శ్రీ॥ ప్రాకట
ముగ యింతలోన । పైనము గావించితిని । శ్వేతముగ అంబారి
ప్యాట । శూలపాణి చూడుమింక ॥శ్రీక॥

వ॥ స్వామి మీరలాజ్ఞాపించిన విధంబున నే భైరవ వీరభద్ర జాను భాను బాష్కలులు నానాయుధంబులు ధరించి యుద్ధంబునకు ప్రయాణము సాగించుచున్నవారు యిక మీరు లేండు.

పర-వ॥ సరి మంచిది పదుండు. (అను నంతలో పార్వతివచ్చి)

పా-వ॥ నాథా ఊరభిచుక పైకి వురుము పిడుగులు గొనిపోయి నట్లు యాకించెద్దానవుని పైకి ఇంత సైన్యంబు గొనిపోవు చుంటిరా ఏనిప్పుడే కాళిక అవతారమెత్తి అట్టిదుర్మార్గుని దృంచి వచ్చెదను సెలవొసంగుడు.

పర-వ॥ పార్వతీ అట్టి శంఖచూడునితో గెల్వ హరి బ్రహ్మాదులకైన వశంబుగాదు ఇక నీవనవానికి తృణమాత్రంబుగాదు నామాట నమ్మి నీవిచ్చోటనే యుండుము.

పా-వ॥ హరి బ్రహ్మాదులకు వశంబుగానిది తామెట్లు జయింతురో కనుంగొనవలెనని కాంత్ష గలిగెను యిక కృపజేసి నన్ను మీ వెంబడించు కొని పోండు.

పర-వ॥ సరి మంచిది నీకంతిష్టమున్న యెడల రమ్ము పోవుదము.

సం-వ॥ అంతలో పార్వతి పరమేశ్వరులు దండెత్తి యుద్ధభూమికిం జని రణభేరి మ్రోగించిన శంఖచూడుండు విని యుద్ధమునకు వెడలు చున్నంతలో తులసి వచ్చి ఇట్లనె.

తుల-వ॥ ప్రాణేశ్వర మీరెచ్చోటికో ప్రయాణోన్ముఖులయ్యె నట్లుగా దోచంబడుచున్నది ఇంతల మీరెచ్చోటికి బోవదలంచుచుంటిరి.

శం-వ॥ సఖీమణీ ఇంతలో నాపైకి శంకరుండు యుద్ధంబునకు దండెత్తి వచ్చి రణభేరి మోగింపుచున్నవారు కావున వారి నిప్పుడే బరిమార్చి వచ్చెద సెలవొసంగుము.

వాదం - యేకతాళం (తరుజు - రారాజా వొక్క-సారీ)

తుల॥ వలదయ్యా రణముకేగా ॥న॥ చలము మాని స్వారాజ్యమిమ్ము ॥
వల॥ శూలపాణి త్రి । శూలముచే నిను । గూలనేసినటు కలగం
టిని ॥వల॥

వ॥ జీవితేశ్వర యా హరుండు రణంబున నిన్ను బరిమార్చినట్లు స్వప్నంబు గంటిని కావున అది తేజులకు స్వారాజ్యంబిచ్చి మన భూమిలో మనము మెలంగుటే యుత్తమము నామాట నమ్ముడు.

శం॥ గోలా నీవిటు లనుటేలనే ॥గో॥ చాలుచాలు యీలీల బల్కకికే ॥
గో॥ అలసురలందరిక్ । నంతమొనార్చెదయు । చాలగ ధనుజుల సవ
రించగవలె ॥గోలా॥

వ॥ కావున పగతురు పైకి దండెత్తి వచ్చినప్పుడాడబాటొంది లోగుటశూర ధర్మమా యేలాయీమాటలు చాలుచాలు యూరొకనుము.

తుల॥ హరునకు పగా గాకుమయ్యా ॥హ॥ అమరావళి మనకంతెచాలు ॥
హ॥ ధీరుండగు యా । సాంబమూర్తి నిను । బరిమార్చెదనని ।
పంతమాడె నట ॥హరు॥

వ॥ మనోవల్లభా రణంబున నిన్ను భరిమార్చి సురలకు స్వారాజ్యంబుజేతునని హరుండు పురంధరున కభయంబొసంగెనట కావున నామాట నమ్మి మీరట్టి తలంపు మానియుండుడు.

శం॥ భయమేలనే ప్రియ । భామినీ ॥భ॥ పయనమైన పతి నాపవలదు ॥భ॥
రయమున సురలక్ । బారదోలియును । జయము గొనియు నిం
కేర వత్తు ॥భయ॥

వ॥ ప్రాణ నాయకీ ప్రపంచం బస్థిరంబుకునుయశంబే శాశ్వితంబు కావున యుద్ధాబునకు ప్రయాణమయ్యే పతిని సతి నాపవలదని శాస్త్రంబులుం దెల్పగ వినియుండి తెల్యని స్త్రీ వలె నన్నాపుట ధర్మమా చెలి సెలవొసంగుము పోయి వచ్చెద.

తుల॥ నా నొదుటా తిరకమూను ॥నా॥ ప్రాణనాథ కాపాడుమయ్యా ॥
నా॥ ఘన బలుడగుయా । గజచర్మాంబరు । కడకేగిన నిను కరుణించును ॥నానొ॥

వ॥ నాథా మీరాజోలిమాని హరునకు శరణు బొందిన దేవ ధానవ వైరంబు మాన్పి మనకు మేలుజేయ గలడు నామాట నమ్మి నానొష్ట కుంకుమ గాపాడుము నీకిదొ నమస్కరించెద.

శం॥ కన్నియా చిన్నంబోకను ॥క॥ సన్నుతాంగి సెలవొసగు మిపుడు ॥
కన్ని॥ పన్నగ ధర అంబారిప్యాట శ్రీ । వెన్నుడు మనలను ।
నేలగలడు ॥కన్ని॥

వ॥ సఖీ నీవు దెల్పుచందంబున నే యప్పరమేశ్వరు పాలికింజని వేల్పులు మున్ను దానవులకు జేసిన యనుచితంబంతయుం దెల్పెదను. ఇట్లు దెల్పగా న్యాయన్యాయంబుల పరిశీలించెనా సరె లేకయున్న రణంబు జేసి జయంబుగొని వచ్చెద ఇదే నేబోవుచున్నవాడ.

తు—వ॥ నాథా అగుము.

సీ॥ ఎత్తి నీవెక్కడమై యెడపక పతిపాద ♦ పద్మచింతనమును బాయనేని ♦ విభుని దైవముగ భావించితదాజ్ఞ జే ♦ కొనిమేలినడవడ మనెద నేని ♦ కల్ల నెప్పుడు నాలుకకు బొరనీయక ♦ సత్యంబె పట్టిని మది దలతునేని ♦ అతిథుల యందు నభ్యాగతు లందును ♦ బేర్మి నన్నంబు లర్పింతునేని॥ గీ॥ నాదుపతివ్రత్య ధర్మమున్నంత వరకు ♦ విష్ణు ఈశ్వర బ్రహ్మ యింద్రాది సురలు ♦ వేయు శరములు దగులక చాయశంఖ ♦ చూడుడే జయముగొను నాదు సత్యమునను ॥

సం—వ॥ అని ఇట్లు తులసి పతమాడి పతినొదుట తిలకము బెట్టి పాదంబులు బట్టుకొన్నంత శంఖ చూడిట్లనె.

శం—వ॥ సఖీ యిక నేపోయి వచ్చెద.

తుల—వ॥ చిత్తము నాథా జయంబుగొని రాండు.

సం—వ॥ అంత శంఖచూడు నిమిస్కమించి పరమేశ్వరుడున్న పాలికిం జని ఈశ్వరునిగని సంతోషముతొ నిట్లనె.

వాదం (తరజు – సోదరా వినునా – మిత్రివేరే)

శం॥ నంది వాహనా । నా । వందనములు గై కొనుమిక ॥నం॥ సుందర విగ్రహా మిముగని । నందంబు నొందితి । నన్నాధరింపుము ॥నం॥

వ॥ శంకరా పాపభయంకర మీపాదంబులకిదొ ప్రణమిల్లుచున్న వాడను కటాక్షించుడు.

పర॥ ధానవాధిపా । నిను । గని మన్నించితిని గాని ॥ధా॥ గాన నీవు మును సురలవి । గొనిపోయిన వస్తువుల్ । జెనుదీయకిమ్మంకను ॥

ఉ॥ నీవును దేను లోకమున । నెక్కని మున్ను మహాత్మ కృష్ణునిన్ సేవయొనర్చు గోపుడవు । సిద్ధము రాధిక శాపమొంది యి ప్డీవిధి ధానవుండవయి । యెంతయు నొప్పితి వట్లుగాన నీ భావమునందు నీరసను । బాయుము డాయుము మేల్మిమచ్చికన్ ॥

వ॥ కావున సురలతో వైరంబుమాని స్వరాజ్యంబాది తేజుల గొనంగుము.

కీ॥ పాలలోచనా । నా । పల్కుల నిటు నాలకించు ॥పా॥ చాలగ యీ సురలు మేము । పాలివారము సగము । పంచుకుందు మయ్యా ॥పాల॥

ఉ॥ దేవర సన్నిధానమున । దెంపున బల్కెద గొన్నిపల్కులన్
భావమునందు వానికయి । పర్వగ జేయక వల్కనాయెడన్
దేవతలేము జ్ఞాతులము । ద్రెక్కొను చుందుము పోరుచుందు మా
దైవవశంబునన్ సిరుల । దాకొను చుందుము మేము వారలున్ ॥

వ॥ కావున ఇట్టి దేవదానవ వైరంబునకు తామడ్డపడవలదని వేడుచున్నవాడను వింటిరా.

పర॥ నీనిజపురము । నందున నీవు మెలంగుమికను ॥నీ॥ గానయటుల మెదులకున్న ॥ జాన రణము జేసి । జయము గొనుము నేడు ॥నీ॥

గీ॥ అట్లుగాకున్న రణము జేయంగ గడగు ♦ వేరుతీరు దలంపక వీరమూర్తి
సర్వమును నాయగ జాలు జానసీవు ♦ నాయమగు తెరువును జెంది నడుచు టొప్పు ॥

దానవేంద్ర మంచి మాటలచే, స్వర్గంబాది తేజుల గొనంగి నీనిజ పురంబున ఇష్ట సౌఖ్యంబు లనుభవించుము లేకయున్న నాతో రణంబు జేయుటొప్పను వింటివా.

శం॥ మోహనాయకా । మమ్మొక సమానమును జూడక ॥మో॥ పక్షపాతి చూపుజూడ । పరమేశ్వరా నీకు । పాడియౌనచాల్ ॥మో॥

సీ॥ మధుకైటభులగోడి మాయతో దెవురించి ♦ వధియించె నవ్వారి శ్రీవిభుండు ♦ త్రిపుర రాక్షసుల నెంతేని మోసముజేసి ♦ యలయించి చంపితీవయ్య నీవు ♦ అమృతంబు సురలనే యారగింపగ జేసి ♦ రాహు నొక్కక చంపె శ్రీహరిపగ తారకముఖ్యులౌ ♦ దైత్యుల గొమరుచే ధునుమాడ జేసితి వనగ నీవు॥ గీ॥ మమ్ము జేజేల నొక్క సమానముగను ♦ జూడకిటు పక్షపాతపు చూపు జూడ ♦ నగునే సకలేశ్వరులకిది యథార్థమాన ♦ దివ్య చిత్తంబునకు జక్క దెచ్చుడీశా ॥

వ॥ కావున ఇట్లు మున్ను మావారి కెన్నో దుష్కృతంబు లొనర్చి యుంటిరి మళ్లినన్న దేవతు జూచుట పాడియు తుదకేమైన సరె నీమాట సహింపను యూరికే మరలిపొమ్ము.

పర॥ కారు మాటలు । యిక । బల్కున సను దృంతుచూడు ॥కారు॥
ధారుణి అంబారిప్యాట । శౌరి యెట్లునిన్ను । గావగలడో చూతుయ॥

ఉ॥ నీదు నివాసమా నగరి । నీవు మెలంగుము భూమినేలు మిం
పొదనుజేంద్రి యిత్తెరగు । నారయు మల్లొడబాటు సేయనేర్
భూధియొనర్తు నిన్నుగ్రితు । భుక్కుల కిత్తు సమస్త సంపదల్
మీదట వచ్చు నాపదల । మేలుగ నీమది నిర్ణయింపుమా ॥

వ॥ కావున యాబ్రిహ్మాచే వరమును గొన్న దానవేంద్రుండని మురయుచున్నవేమో కాని నీసమస్త సంపదలన్ని బూడ్దిగా జేసి సుఖము మేలు జేసెద చూడుము నాప్రతిజ్ఞ.

శం–వ॥ శంకర మరియు నేడెట్లులెనను.

ఉ॥ ధీరతబాసియోటుపడి । దీనతనొంద దలంపదేవ దు
ర్వారము కర్మబంధమని । ప్రాజ్ఞులు బల్కెద రద్ది నమ్మెదన్
దీరపుమొగ్గరంబదియె । దీర్చెద వోర్చెద మీబలంబులన్
సారెకు దివ్యవర్గముల । జక్కడగించెద గాంచెదన్ బ్రిదన్ ॥

వ॥ ఒరే శంకర నీవు మా ఇష్ట దేల్పువని నమ్మికొన్నను మమ్ము విడనాడి ఇంద్రునకు సహాయమయ్యి పక్షపాతం మాట్లాడుచుంటివా చీ దుర్మార్గ నీవాక కులద్రోహి గుణహీనుండవని ఎంచుదుగాని నీపెద్ద మాటలకు పిరికిపడెవాడనుగాను నమ్ముము,

వాదం (తరజు – ఏదిర కార్ముఖ – మితిరివేర)

పర॥ ఎంతటి వాడవురా । నన్నింతలోన నిందెపాలు జేయగ ॥యెంత॥
మంతనమున నన్ను యెంత మాత్రము । మహేశ్వరుండని తెలంచ
వికనీ । గొంతు బిక్కచంపు దింతలోన । కోపమున । పాపమనక
నీరూపడంతును ॥ఎంత॥

వ॥ ఒరే రక్కసి నన్నెంత మాత్రిము పరమేశ్వరుండని భావించక పలుమాటలు బల్కుచుంటివా సరి మంచిది రారమ్ము రణంబున నీపురుషార్థంబు జూచెద.

శం॥ సంతోషంబాయే । నా । శ్వాంతమందు నీతో రణముజేయుట ॥
సం॥ ఇంతకు మునుముందు నీకొరకు యే । నెంతో యెదిరిచూచు
చు టీ శ్రీకాంతు జనక మిత్రి నిన్ను బట్టి ॥ దండించి । కండించి ।
చెండాడెదనిక ॥సంతో॥

వ॥ కావున సమయానికి వంటింటికి కుందేలు వచ్చినట్లు నాసన్ని
ధికే వచ్చియుంటివి సరి ఈరణంబున నిన్ను సీక్షించి కైలాసంబునకుబంపెద
చూడుము నాపురుషార్థము.

పర॥ ఎక్కువ బల్కకురా । నిం । దక్క నివ్వ నీముల్లోకంబున ॥ఎక్క॥
రక్కనుండవయ్యె నాతో యింతల । రణముజేతునంచు దుంకు
చున్నను । సిక్కమునగ నిన్నుబట్టి త్వరలో । నృక్కడంచి । సురల
కిపుడు । సుఖమున్ నిత్తును ॥ఎక్క॥

వ॥ ఒరే దుర్మార్గ నీ నోటికి వచ్చినట్లు వదురుచుంటివ నీమదం
బడంచి సురలకు మేలుజేసెద చూడుము నాప్రతాపము.

శం॥ నిక్కీ నీల్గకురా । స । న్నొక్క క్షణంబులో ద్రుంచెద చూడుము॥
నిక్కీ॥ పెక్కుమాటలేల బల్కేవుర యీ । పోరులోన నీబలంబు
జూచెద । మిక్కటంబయ్యె క్రోధమింతలో । మురియబోకు । పైకి
రాకు । మూర్ఖ మదాంధ ॥ని॥

వ॥ ఒరే శంకర మాటిమాటికి నన్ను ద్రుంచెదనని పల్కుచుంటి
వైతె నీమాటలకు పిరికిపడి పారిపొయ్యె వాడనుగాను నిన్ను ద్రుంచి కైలా
సంబు నాస్వాధీనము జేసుకొనియెద చూడుము.

పర॥ చాలిక వదురకురా । త్రి । శూలము వచ్చెను చూడుము
యింతలో ॥చాలి॥ పాలుమాలినట్టి మాటలేలర । బ్రతుకలేవు
నీశిరంబు ద్రుంచును । కలుడ నీదుతల్లి దండ్రులింతలో । దలపోయు ।
చలముగా విడిచుది ॥చాలి॥

వ॥ ఒరే శంఖచూడ ఇదో నీపైకి మదీయ త్రిశూలము విసరు
చున్నవాడను యిక బ్రతుకజాలవు పారిపోక నిల్వంబడుము.

శం॥ శంకర త్రిశూలం । యిక । లెంకి జూడగా నరాదు యేదిర ॥శం॥
పొంగమైన అంబారిస్తాట శ్రీ । వెంకటేశు సఖుడనంచు మురి
యుచు । దుంకుచుంటి వంతలోన శివ నీ । సుంకుబాపి । మంకు
బాపి । సుఖము నొందున్ ॥శం॥

వ॥ శంకరా నీవు వేయు త్రిశూలము నాకండ్ల గనింతయన్నను అగుపడదేమిర యిక నన్ను గెల్వజాలవు శరణుబొంది కైలాసంబేగుము లేకయున్న బ్రతుకజాలవు నమ్ముము.

సం-వ॥ అనునంతలో పార్వతి వచ్చి శంఖచూడుని గాంచి.

పా-వ॥ ఒరే రక్కసి పరమేశ్వరుండని నీవెంత మాత్ర మెరుంగక పలుమాటలు బల్కుచుంటివా దురాత్మ నిన్ను వధించుటకిదే కాళిక వచ్చి యున్నది కనుంగొనుము.

శం-వ॥ ఒహెూ పార్వతీ నీవు నన్ను వధించు టాసకి వచ్చితివా సరి మంచిది రారమ్ము నీకెంత చాతుర్యంబుగలదో చూచెద.

వాదం - రూపకము (తరజు - కంసాభూవరుడా)

పార్వ॥ ఓరీ ధానవా । రణ । శూరునంచు మురియుబోకుమి యిక ॥ఓరీ॥
చార విచారము నీలో శంకరుడని యెంచక యీ । తీరున దూషించిన నిక్ । కాలుని పురికనిపెద విను ॥ఓ॥

వ॥ ఒరే పాపిష్ట నిన్నిప్పుడే వధించి యెమపురికనిపెదను చూడుము నా కాళిక అవతారము.

శంఖు॥ చాలు పోపోవే । యీ । లీల భల్కుటేల నాతోనిక ॥చాలు॥
కాళిక యంచును బహు యిక । చాలగ పేలుచు నుంటివ ।
నీలాలకి నిను బట్టియు । నింతలో ద్రుంచెద చూడుము ॥చా॥

వ॥ పార్వతీ నన్ను జయించ నీనాథుని వశంబేగాను లేదు కించె తాడు దానవు నన్ను ద్రుంచుదువ యిక మిమ్ము రుద్రపురినిద్రుంచి ఏను కైలాసంబేలువాడను జూడుము నా పురుషార్థము

పార్వ॥ కయ్యాముననుయా । యిక । కాలు ద్రువ్వుచుంటివ దురాత్మా ॥క॥
ఇయ్యెడ నీపైకిని యిదో । విసరితి త్రిశూలంబును । సయ్యన నిను ద్రుంచు నీ । సతి సుతులం దలపోయుము ॥కయ్యా॥

వ॥ ఒరే రక్కసి ఇదో నీపైకి మదీయ త్రిశూలము ప్రయోగింపుచున్నదాననుయిక శూరుండవైతే దీనిందప్పించుకొనుము చూచెద.

శంఖు॥ చూడవే యిక నీ । త్రి । శూల మిపుడు చూర్ణము గావించితి ॥
చూ॥ ఆడుదానవు నాతో । వాధంబేలను జేసెవు । వోడితి నని మొక్కుచు నీ । వెల్లుము కరుణించితినిక ॥చూడ॥

వ॥ శాంభవి నీవు వేయు త్రిశూలమును ముక్కముక్కలుగా ఖండించినాడను యిక నన్ను గెల్వజాలవు పారిపొమ్ము.

పార్వ॥ దానవాధమా । నీ । వసగనాకు నెంతమాత్రింబిల ॥ధాన॥ కాని పోనీ మాటలు । కపటాత్ముడ బల్కిన యీ । రణమున నిను వధియించి ను । రక్తము ద్రాగుదు చూడుము ॥దాన॥

వ॥ కావున నిన్ను ద్రుంచిన నీతల్లిదండ్రులు దుఃఖింతురనియే నిందాక తాళియుంటిని సరి మంచిది నిన్నిప్పుడే ద్రుంచి నీ రక్తముద్రాగి నా క్షుధ మాన్పుకొని యెద చూడుము.

శంఖ॥ పేరు నొందినా । అం । బారి ప్యాట । హరికైనను భీతిల్లను ॥ పేరు॥ నారీరత్నము నాసరి । వీరుండెవ్వడి ధరలో । మారాడిన నిన్నిప్పుడు । మర్దించక పోనివ్వను ॥పేరు॥

వ॥ కాళికా ఈ పదునాల్గు జగంబులందుగల దేవమానవులుకూడ నన్ను గెల్వలేరు యిక నీవన నాకెంత ఈ సృష్టికి ఏనే దొరనని నమ్ముకొనుము.

వాదం — ఆటతాళం

పార్వ॥ దుష్టచిత్తుడ రార యిక నీ । దుండగులన్నియు మాన్పుదింతలో ॥ దు॥ సృష్టికీ దొరవాడు చెట్టులో । చూడుమిదో గధవచ్చె నీపై॥

వ॥ ఒరే దురాత్మ ఇదో నీపై మదీయ గధ వచ్చుచున్నది శూరుండవాదు వేని దీనిం దప్పించుకొనుము చూచెద.

శంఖ॥ హరుని రాణివటంచు నిన్ను । హతము జేయక యుంటిగాని ॥ హ॥ కారుమాటలు బల్కినావిక । ఖండఖండలు జేతు చూడుము ॥

వ॥ కావున ఆడుదానిని జంపిన పాతకమని యోచింపుచున్నందున ఇంతకింతకు పొంగుచుంటివా సరి నీగధను పిండిపిండిగా జేసినాడను ఇక పారిపోక నిల్వంబడుము ద్రుంచెద.

పార్వ॥ పాశుపదమును వచ్చెనురా నీ । ప్రాణములను । దీయుచూడుము॥ పా॥ దోషకారి వటర నిన్ను । ద్రుంచక పోనివ్వదింతలో ॥పా॥

వ॥ నీ వెరుపుమాటల కేను వెరచి పారిపొయ్యే దానను గాను. ఇదో నీపైకి పాశుపదాస్త్రము ప్రయోగింపుచున్నదాన ఇకతొలంగక నీవచ్చట నిలువం బడుము నాబలంబు జూపెద.

శంఖు॥ పాశుపద మన నెంత యీ పర । మేశ్వరుండన నెంత నాకిల ॥పా॥
శశిముఖి నిన్ బట్టి యింతలో । శిక్ష జేయక పోనుచూడుము ॥పా॥
వ॥ ఒసె ముసీలి మాటిమాటికి నన్ను ద్వంచెదనని పల్కుచుంటి వైతె ఇదో నీపైకి మదీయ బ్రహ్మాస్త్రంబు ప్రయోగింపుచున్నవాడను ఇది నిన్ను శిక్షజేయక పోనివ్వదు చూడుము.
సం–వ॥ అంతలో గుహుండు నడ్డంబువచ్చి శంఖచూడునిగని.
గు॥ రారా ధానవాధమా రణ । రంగమునకును భీతినొందక ॥రార॥
క్రూరచిత్త నిన్నుబట్టి । శూలనేసి కీర్తి గాంచెద ॥రార॥
వ॥ ఐరే మూర్ఖ జగజ్జననియని నీ వెంతమాత్రము పాటించక పలు మాటలు బల్కుచుంటివా నీమధింబడుచుట కిదే గుహాఖ్యుమారుండు విచ్చేసి యున్నవాడు తొలంగక నిల్వుంబడుము.
శంఖు॥ ఎంత వాడవురా నీ వ్వ । ధింతు చూడుము నిల్వుమచ్చట ॥ఎం॥
ఇంతలో అంబారిప్వాట । ఈశుడచ్చిన భీతినొందను ॥ఎంత॥
వ॥ ఒరే గుహా ఇదో నీపైకి బ్రహ్మశక్తి బాణంబు ప్రయోగింపు చున్నవాడను యిక దీనిం దప్పించుకొనుము.
సం–వ॥ అని బ్రహ్మాస్త్రంబు విడచిన గుహునికి దగిలిన గుహుండు మూర్ఛిల్లిన పార్వతిగని.
పార్వ–వ॥ హా కుమార గుహా॥
సం–వ॥ అని పార్వతి గుహుని లేవనెత్తుచున్నంతలో నారదుడు వచ్చి శంఖచూడునిగని.
నార–వ॥ భేష్ భేష్ శంఖచూడ నీవంటి వీరపురుషుండీ లోకంబున వెంకిన దొరుకునా దొరుకడు ఆహా నీబాహుబలంబి తని చెప్పరాదుగద.
పార్వ–వ॥ నారదా నాముందర యిద్దురాత్ముడింత పెపు జేయు చుంటివా కానికాని యప్పరమేశ్వరుని త్రిశూలముచే ముమ్మాటికి జచ్చు నని నమ్మను.
శంఖ–వ॥ నారద యిద్దురాత్మురాలి మాటలు వింటివా సరి యప్పర మేశ్వరున కెంత బలంబు గలదో ఇప్పుడే పోయి వానిన్ వధించి వచ్చెద చూడుచూడుము నాపురుషార్థము. (అని వెల్లిన పార్వతి)
పార్వ–వ॥ నారదా యద్దురాత్మునిపై నెన్నిబాణంబులు ప్రయో గించినను వాటి నన్నిటను తృణీకరించి కయ్యంబునకు కాలు దువ్వుచున్న

వాడు కావున యికవాడెట్లు జచ్చునో కృపజేసి అట్టియుపాయంబూహించి తెల్పుము.

నార-వ॥ ఇప్పుడేమి దెల్పవలయును పార్వతి అలనాడు నేనన్నమాట నీకిప్పుడు సజమైనదా.

పార్వ-వ॥ నారదా అదంతట్లుండనిమ్ముగాని ఇప్పుడేమి సేయవలయునో తెల్పుము.

నా-వ॥ తెల్పునదేమి వాని సతియగు తులసి శీలము జెడినవాడు జచ్చును లేకయున్న వానిపై మీరెన్ని శస్త్రాస్త్రంబులు ప్రయోగించినను చావడు ఇది నిక్కమని నమ్ముము.

పార్వ-వ॥ బ్రహ్మపుత్రా యప్పని నీవలననే కావలయును.

నార-వ॥ సరిమంచిది ఏని తెలో వైకుంఠంబునకేగి లక్ష్మీనారాయణున కీవిధంబంతయు దెల్పి యప్పని నెరవేర్చెదగాని నీవు నీనాథునింజేరబొమ్ము.

పార్వ-వ॥ చిత్తను అట్టులనే పోవుచున్నదానను.

సం-వ॥ అని పార్వతి నిష్క్రమించిన నారదుడు వైకుంఠంబుకేగి.

నా-దరువు॥ నారాయణ శౌరీ । నరహరి ॥నా॥ నారాయణ నీనామమె మధురము । కారణరూప మురారిపరాత్పర ॥నారా॥

వ॥ లక్ష్మీనారాయణ మీకిదో నమస్కరింపుచున్నవాడను కటాక్షించుడు.

వి-వ॥ నారదా వర్ధిల్లుము.

వాదం (తరుజు - మాయొక్కముగ మతిప్రియా)

విష్ణు॥ నారద నిను గనుగొన్నంతలో । మహా । నందంబు నొందితినీ యింతలో ॥నా॥ త్వరగా నీవిందు వచ్చిన । కారణమేమిదో । కాంక్షలో దెల్పుము ॥నార॥

వ॥ నారదా నీవిచ్చోటికి త్వరగా విచ్చేసిన కారణంబేమొ తెల్పుము.

నార॥ నరహరి నేనేమి దెల్పుదు । నా । నోరాడకున్నది వినుమిప్పుడు ॥ నర॥ ఏరీతి హరునీ నోదార్తువో । ధరవర యిక । దక్కదు యీ జగమ్ ॥నర॥

సీ॥ ఏనుగు రౌతులట్లేనుగు రౌతులతోడ ♦ రథికులట్టులు మహారథుల తోడ ♦ గుఱ్ఱపు రౌతులు గుఱ్ఱపు రౌతులతోడ ♦ బంటులును బంట్లతో బహుబెనంగు ♦ చుండిరి మదయుతు నుండిరి తలలును ♦ గరములు పదములు స్కంధములును ♦ గూలుచునుండెను గుట్టల యట్టులు కరులును హారులును సురగిపుడమి॥ గీ॥ గూలుచుండెను నెత్తురుల్ గొప్పవాగు ♦ లగుచు బ్రవహించుచుండెనందరక్త జగము ♦ విరిగి యొగిగిన యూరథముల్ విరవిగాక ♦ సన్‌బడుచు నుండె బడవలనాడెగమునా ॥

వ॥ ఇంత యేమని తెల్పువాడను తెల్పుటకు నానోరాడకున్నది అట్టి రణంబునుండి హాయుండెట్లు కడతేర్చి వచ్చునో తెలియదు.

విష్ణు॥ హారునకు శత్రుండెవండోకా। నా। కాశ్చర్యంబయ్యె తోచెగా॥

హా॥ నారద నీవనుమానించక । సరగున దెల్పుమి । సంశయ మెందుకు ॥హా॥

వ॥ నారదా యా పార్వతీశునకు పగవాడెవండో సవిస్తారమంత వేగంబున వినంజేయుము.

నారద॥ ధీరుండు శంఖాచూడుండును । యా। పురంధరుని యికనోడించినా ॥ధీ॥ గిరీశ్వరుని కడకు నేగిన । వైరంబు గల్గెను । వారికి యింతలో ॥ధీ॥

సీ॥ వృషపర్వుతో గోత్రభేదియు నవ్విపి ♦ చిత్తుతో నుష్ణరశ్మియును ఖంబు ♦ తోనచ్యుతుడు కాలుతోడ దండధరుండు ♦ గోకర్ణుతో నగ్ని పీకమీరు ♦ కాలకేతునితోడ జాలస్యుహమ్మయు ♦ తో విశ్వకర్మ సంతోషమొప్ప ♦ నాభయంకరునితో నలమిత్రి చంచలు ♦ తోగాడ్పు ఘటపృష్ఠుతో బునుండు॥ గీ॥ ఒసపి రక్తాక్షుతో శనేశ్చరుండు కావ్యు ♦ తో గురుంకు రత్నసాలుసితో జమునిపు ♦ దష్ట వసువులు వర్చశ్చ యుంబుతోడ ♦ నాపురంధరుతో ధర్మడని బెనగిరి॥

వ॥ కావున యా శంఖచూడుతో గెల్వ శంకరునకు వశంబుగాక యున్నది యిక యద్దానవున్ని తాను ద్రుంచి ఈశ్వరుండింద్రునకభయం బిచ్చిన పరికారము సురలకు స్వరాజ్యంబొసంగుటే యుత్తమము నామాట నమ్ముడు.

లక్ష్మి॥ మదీయభక్తుడు సుధాముసీ । యిక । వధించు నెట్టుల శ్రీనాథుడు ॥
మ॥ ఏదైన ఈశ్వరునీ భారమే । నీదాడి మాటాలు । నిచ్చోట
దెల్పాకు ॥మదీ॥

వ॥ నారదా మాభక్తుని మేము వధించుట ముఖ్యమేన అట్లు ద్భం చిన యా తులసీసతి మహా పతివ్రిత మాకేదియైన శాపమిచ్చిన మేమోప జాలము యూరికె మురలిపొము.

నార॥ శ్రీలక్ష్మి నీవిట్లు బల్కిన । యిక । యేలాగు ఈజగము దక్కును॥
శ్రీ॥ శూలాగ్ర గణ్యుండు సురలకై । చాలగ పోరాడ । లీలాన
యూరొ్కన ॥శ్రీ॥

వ॥ లక్ష్మి వారిమపురట్లు పెక్కండు రణంబు సల్పిన ఈజగంబు దక్కునా ఏదో వారికొక హితవైన వాక్యంబులుందెల్పి క్రోధంబు శాంతింప జేయుమంటిని గాని వేరొండుగాదు ఇందులకు నా నేరంబేమున్నది.

లక్ష్మి॥ నీవన్నమాటలు నిక్కంబనీ । నా । భావంబునక నమ్మదెట్టుల ॥
నీవ॥ ప్రావీణ్యముగ కలహప్రియుండవే । వివేకముగ నీదు । విధమెల్ల
దెలుసును ॥నీవ॥

వ॥ కావున నీవు కలహ ప్రియుండవు నీమాటలు ముమ్మాటికి నమ్మలేను శ్రీహరిని యుద్ధభూమికిం దోలించను (అని హరవంక జూచి) నాధా ఈ నారదుని మాటలు నమ్మి శంఖచూడునిపైకి రణంబునకుం బోవలదని వేడుచున్నదాన.

విష్ణు॥ గోలా యీవాదంబు జాలించి నీవిక । మేలంచు నాపల్కు లాలిం
చుమా ॥గో॥ సేలుగ అంబారిష్యాట శ్రీ । లోలుడ నయ్యే నే ।
పాలింతు భక్తుల ॥గోలా॥

వ॥ ప్రాణనాయకీ ఈ నారదుడు దెబ్బ వాక్యంబులబద్ధ మనుకొంటివా కాదుకాదు నిజము యేనిప్పుడేపోయి దేవదానవ వైరంబుమాన్పి వచ్చెద సెలవొసంగుము.

లక్ష్మి–వ॥ నాధా అట్టులైన మీచిత్తము పోయిరాండు.
సం–వ॥ అని లక్ష్మి నిష్క్రమించిన విష్ణు నారదునిగని.
విష్ణు–వ॥ నారదా యిక పోవుదము రమ్ము.
నార–వ॥ స్వామి పోవుదాముగాని యొక్కవిచారము.
విష్ణు–వ॥ నారదా అదెట్టి విచారము శీఘ్రంబున వచించుము.

నా-గీ॥ శంఖచూడ రూపంబును జెంది యిపుడు ♦ అమరావళి కేగి శ్రీహరియు నీవు ♦ తులసి పతివ్రత్య ధర్మంబు జెడిపియున్న ♦ శంకరుని త్రిశూలముచే జచ్చు శంఖచూడు ॥

వ॥ కావున నీవీ సమయంబున శంఖచూడ రూపంబుదాల్చి తులసిని జెరిపితివేని శంకరుని త్రిశూలముచే యద్దానవుండు జచ్చును లేక యున్న వాన్ని మెప్పించ నీతరంబుగాదు నాతరంబుగాదు నామాట నమ్ముడు.

విష్ణు-వ॥ నారదా ఎంతమాటాడితివి ఆమెకూడ నాభక్తురాలే యదియేనెట్లు జెరుపవలె.

నారద-వ॥ స్వామి ఒక భక్తురాలుకొరకై ఈ జగోత్పాతమును సహింపగలవా ఐన మీకుం దెల్యనిదేమున్నది.

విష్ణు-వ॥ సరి నీవన్నట్టులనే యొనర్చువాడగాని నీనిజవాసంబునకుం బొమ్ము యేనిదే తులసి సన్నిధికేగుచున్నవాడను.

సం-వ॥ అంత విష్ణు శంఖచూడ రూపంబున తులసి సన్నిధికేంజనిన నాయొప్పుల కుప్ప భర్తయనినమ్మి సంతోషముతో మాయ శంఖచూడుని గాంచి యిట్లనియె.

తు-వ॥ నాధా మీకిదొ నమస్కరించెద కటాక్షించి యుద్ధజయం బెట్లు పొసగెనో తెల్పుండని కోరుచున్నదాన.

మా-వ॥ సఖీమణీ వర్ధిల్లుము తత్సంగతి దెల్పెద యిటు వినుము.

వాదం - ఏకతాళం (తరుజు - అనఘ మనపూర్వజన్మ)

మా॥ ప్రియా నాయాకి యుద్ధమునను । జయము గొని వచ్చితెంత లోనఁ ॥ప్రి॥ దయామయుడు శంకరుండు యిక మన । దానవుల కును మేలుజేసెఁ ॥ప్రి॥

వ॥ కాంతామణి యోగిరీశ్వరుండు మన వస్తు వాహనంబులెల్ల మన కిప్పించిన ఏను ఆది తేజులకు స్వారాజ్యంబిచ్చి వచ్చితిని వింటివా సఖీ.

తుల॥ జీవితేశ్వరా యింతలోన । భావమునను భయంబు దొలిగెఁ ॥జీ॥ సవినయముగా సాంభశివుని । శాంతమేమూని వాడుకుందుఁ ॥జీ॥

వ॥ ప్రాణవల్లభా నామది సంతోషమాయెగాని మీకెంత క్షుధయగుచున్నదో అన్నము భుజించి అలసట దీర్చుకుందు రాండు.

మా॥ కలికి నినుగనుగొన్నంతలోనా । చాల మోహంబు గల్గెచానా ॥
కల॥ వలపులా చిల్క యింతలో నా । వాంఛదీర్చా రావె
భిరాన ॥కల॥

వ॥ తరుణీ నిన్నుగాంచి నప్పటినుండి యీమరుండు విరుశరమ్ముల దాల్చి నాయురమ్మున గుచ్చుచున్నవాడు కావున నీవొకసారి కౌగలించి నామనోభ్రాంతి దీర్పుము సఖి

తుల॥ సరెను మంచిదీ ప్రాణనాధా । సంతసంబాయె నేటిదినము ॥సరె॥
మీరుగోరినట్టి కోర్కెలికను । వేరుజేయక దీర్తురమ్మ ॥సరె॥

వ। మనోహర మీకంత ఇష్టమున్నయెడల ఏను వెనుదీయుదు నెటుల ఇంతలో నన్నుగూడి మీమనోభ్రాంతి దీర్చుకుందు రాండు.

సం-వ॥ అనునంత విష్ణువు శయ్యపై పరుండియున్న తులసి పాదసేవ జేయుచున్నంత మాయ శంఖచూడు.

మా॥ పడతి నీపతివ్రిత్యా ధర్మ । నడతలను బాగుడంగ తరమే ॥పడ॥
పాడిగా శ్రీఅంబారిప్పాట । పాలలోచను జేలుమనలో ॥ప॥

వ॥ సఖి యిప్పుడుగదా నామనంబానందంబాయెను. సఖి నీకెంత నిద్రవచ్చుచున్నదో పరుండుము.

సం-వ॥ అని తులసి మాయా శంఖచూడులు సంతోషంబున క్రీడించుచున్న యుద్ధభూమిలో శంఖాచూడుండు శంకరునిగాంచి.

శం-వ॥ ఒరే శంకరా నీవెచ్చోటికో పారిపోవుచున్నవాడవు నిల్వు నిల్వుము నిన్ను దృంచి జయంబు గొనియెద

పర-వ॥ ఒరే దానవేంద్ర మళ్లి నాతో రణంబుజేయుటకు వచ్చియుంటివా సరి రమ్ము నీబలంబు జూచెద.

వాదం - జుల్వ.

శంఖ॥ రార శంకరా యిటు । రణమునకును భీతిల్లక ॥రా॥ ధీరత వహించి
నిన్ను దృంచి నేడికను । ధారుణిలో పేరుగొందు ॥రార॥

వ॥ కావున నీవెందేగినను యేనందేతెంచి నిన్ను దృంచక విడువను యిక పారిపోక నిల్వంబడుము.

పర॥ ఏర దానవాదమా । ఎంతటి బబవంతుడవిల ॥ఏర॥ క్రూరచిత్త
నిన్నింతలో । గూలనేసియు । సురలకు క్షేమము జేతును ॥ఏర॥

వ॥ ఓరే శంఖచూడ వినాశకాలంబునకు విపరీత బుద్ధులు బుట్టు నన్నటు నీకు ఆయుష్యంబు నిండివచ్చెనేమొ సరి సమరాంగణంబున నిన్ను ద్రుంచి సురలకు మేలొసంగెద.

శం॥ కపటాత్ముడ నీవయిరా । గరుడాస్త్రము విడచితి సదా ॥కప॥ నోప
జాల కింతలోనా । కోడితినని నా । దాపు జేరినను విడువదు ॥కో॥

వ॥ ఓరే శంకర ఇదో నీపైకి గరుడాస్త్రంబు ప్రయోగించుచున్న వాడను శరణు బొందుము లేకయున్న నిన్ను ద్రుంచును చూచుకొనుము.

పర॥ మంచిది దనుజేంద్ర నీ । మర్మమెల్ల దెలిసెను యిక ॥మం॥ మించి
పల్కబోకురా । వంచెద నీ మత్తిరా । గాంచుము యిదో గధ
వచ్చెను ॥మం॥

వ॥ ఓరే మూర్ఖ నీవు పురుషార్థివేని ఈ గధదెబ్బను దప్పించు కొనుము చూచెద.

సం—వ॥ అని గధ విసరిన శంఖచూడుకు దగిలి మూర్ఛిల్లి లేచి,

శం—వ॥ (తనలో) ఇదియేమి యాశ్చర్యము పిపీలకాది బ్రహ్మ వేత్తలకునైన వెరువని శంఖచూడుండని పేర్గాని ఇప్పుడీ శంకరుని గధ దెబ్బకు మూర్ఛావిత్తలు గలుగవలసి వచ్చెనుగద సరి మంచిది ఇంక నాశక్తికొలదిగా పోరాడెదగాక. (ప్రకాశముగా)

శం॥ పక్షవాధి వటరనిక । శిక్ష జేయకను విడువను ॥పక్ష॥ మోక్షదాయ
కుండనంచు । మురియబోకుమీ । తక్షణమున ద్రుంతుచూడు ॥ప॥

వ॥ ఓరే శంకర నీపైకి దారుణియ బ్రహ్మాస్త్రంబు ప్రయోగింపు చున్నవాడను ఇక దీనిందప్పించుకొనుము చూచెద.

పర॥ ఈక్షితి అంబారివ్వాట । ఈశ్వరుండనై యిప్పుడు ॥ఈ॥ రాక్షస
నీవనగనాకు లక్షణమేమీ । ఈక్షణములో ద్రుంతుచూడు ॥ఈ॥

వ॥ ఓరే దానవేంద్ర యిదో నీపైకి మదీయ త్రిశూలంబు ప్రయో గింపుచున్నవాడను ఇక దీని దప్పించుకొనుము.

సం—వ॥ అని శంకరుడు త్రిశూలము విసరినంతలో శంఖచూడుని శిరమ్ము దెగి తులసి కేళికా గృహంబునంబడి తులసి తులసియని బిలుచు చున్న విష్ణువు తులసి నొదుటనున్న కుంకుమ దుడచిన తులసి తెలివొంది విష్ణువు హస్తము దొరుక బట్టెట్లన.

తుల-వ॥ ఓరి నీవెవండవో నిజంబుగ దెల్పుము తక్కిన శపింతును చూడుము.

సం-వ॥ అంతె పుండరీకుండిష్ణావతారంబు జూపించిన తులసి కను గొని కోపమున.

తు-గీ॥ పాపమును పుణ్యమును లేదె బండనాదు ♦ శిలమంతయు నెట్టెట
జెందె నట్లు ♦ దుండగం బొనరించితే దోసకారి ♦ మొండి శిలనయ్యె
యుండుము గండడంగ ॥

వ॥ ఓరి పాపివిష్ణూ నాశీలంబును జెరిపితివైతె నీవు రాయిక మొండి శిలవౌదువు హామ్మ్ నీకిదియే శాపము.

సం-వ॥ అని తులసి శంఖచూడు శిరస్సును బట్టుకొని నాథానాథా యనుచు దుఃఖముతో.

తులసి - దర్వు - ఆటతాళం (తరుజు - కోడు కానినువి)

నాథా నీకితవౌనె నను బాయుచు ॥నా॥ నీతి మంతుడవాని । నెర నమ్మితీని నయ్యా ॥ మతి మంత నినుబాసి । నేత్రారి తరియింతు ॥నా॥ మున్నా । నీ కెన్నో హితవులు దెల్ప ॥ము॥ సన్నుతగుణశాలి । స్వారాజ్య మివ్వాక । వన్నుగ మారునకు । పగనయ్యి మడసితివ ॥నా॥ నీసతినీ నన్నే లగ రావ । నీసతినీ ॥ పసుపు కుంకుమలాపై । ప్రేమదీరకమున్నే । ఈ సమయము నన్ను । మోసంబు జేసితివ ॥నా॥ నీవులేనీ । యీజన్మంబు నా కేల సఖ ॥ నీవులేని ॥ సవినయముగ నీదు । సన్నిధికిని వత్తు । నీవేగు తోడ్రోవేదొ నింతలో జూపవ ॥నా॥ యేలా నాపైనీకు కృపరాదు ॥యేలా॥ వాలాయముగ శ్రీ అంబారిప్యాటా వారియు । ఈలీల జేసునని కళనైన దెల్యానా ॥నాథా॥

వ॥ హా నాథా నాథా నన్నుబాసి నీవొక్కండవే నిద్రించు చుంటివా ఐనా నీప్రియురాలినగు తులసిని నాతో మాట్లాడవెందులకు ఇక నీతో వచ్చెద నన్ను నీవెంబడించుకొని హామ్మ్.

సం-వ॥ అని తులసి పతిదేహకాండంబునం బడంబోయిన విష్ణు మూర్తిగాంచి తులసితో నిట్లనియె.

విష్ణు-వ॥ తులసి సతీ ఆగుమాగుము యేనొక్కమాట జెప్పెద.

తుల-వ॥ అయ్యో పిలువని పేరంటము వేయని విస్తారియనునట్లు మళ్లీ నీవిచోటికి కొందులకు వచ్చితివివి.

వి-గీ॥ చెలువ గోలోకమున నన్ను గొలుచుచున్న ♦ సతి వినాయంశ
జూతుడౌ శంఖచూడు ♦ పడతివైతి విప్రునుమన బరగ దిరుగు ♦
జేరు గోలోకమున కిపుడు చింతబాసీ ॥

వ॥ కావున ఐన కార్యంబునకు చింతించిన నేమిఫలము నీకెల్లప్పుడు ముత్తైదతనంబుండుటకు వేరొండు రూపంబున నీవు తులసీ వృక్షమై జన్మించుము. ఏను నీశాప ప్రకారంబున శాల్గ్రామ శిల నగుదును నీపతి యస్థికలంబు లన్నియు శంఖంబులై యుద్భవిల్లును అదియెటులన్నను ప్రతి సంవత్సరంబున వచ్చు కార్తీక మాసంబున సకల జనంబులు తులసీ పరిణయము గావింపుచు పస్పుకుంకుమ పన్నీటితో నిన్ను పూజింతురు నట్టి శంఖోధక తులసి ధళములతో నన్ను పూజింతురు ఇట్లు పూజించిన వారు ఎల్లప్పుడు సుఖంబుల నొందుదురు యిక నీవీ చింతమాని గోలోకంబున కేగుము.

తు-వ॥ చిత్తము శ్రీహరీ ఇదే నేగోలోకంబున కేగుచున్నదానను.

సం-వ॥ అని తులసి గోలోకంబున కేగిన విష్ణుమూర్తి శిలరూపంబు దాల్చినది నారదులు దెలుసుకొని వైకుంఠంబున కేగిన లక్ష్మి నారదుని గాంచి యిట్లనియె.

లక్ష్మి-వ॥ నారదా నీవు వచ్చితివిగాని నానాథుండేడి.

నార-న॥ లక్ష్మి నీనాథుని సమాచారమేమని తెల్పవలయును తెల్పుటకు నానోరాడకున్నది.

లక్ష్మి-న॥ అదె యెందుకని అనుమానింపు చుంటివి.

నార-న॥ తల్లి లక్ష్మి యా శంఖచూడు జచ్చుకొరకు విష్ణుమూర్తి శంఖచూడ రూపంబున తులసి సన్నిధికింజని నామె శీలంబు జెరిపిన నాయొప్పులకుప్ప శ్రీహరిని శిలరూపంబు నొందగలవని శపించిన నీనాథుం డిప్పుడు గండకీ నధియందు శాలగ్రామ శిలనయ్యి యున్నవాడు వింటివా.

లక్ష్మి-వ॥ హా నాథా నాథా (అని మూర్ఛిల్లిలేచి)

లక్ష్మి - దర్వు - ఏకతాళం

ఓనాథా నీదరిశన భాగ్యము నా। కెన్నడబ్బునో ॥ ఓప్రియతమా నీమృదు మధురపు వాక్యము లెన్నడిందునో ॥ఓ॥ సతతము నీసతి నీదయ।

మతివని నమ్మితిని గదే । హితవే నన్నొంటరిగను । విడచీ నీవచటుండుట॥ ఓహో॥ తులసీ సతి పతివ్రతయని । దెలుపగ నీవిచకను యా । నీలాలకి పొందుగోరి । శిలరూపము నొందితివా ॥ఓనా॥ నీలమేఘ శ్యామలాంగ । నిటలనయణ వోశుభాంగ । ఈలీల యగునని నా । కలనైనం దెల్యను హా ॥ఓనా॥ ధారుణి అంబారిప్యాట । నీరజాక్ష నిన్నిపూట । కోరిభజించితినీ నిజ । స్వరూపము జూపుమనీ ॥ఓనాథా॥

వ॥ హా నాథా నోథా నన్నింత మోసంబు జేసిపోయితివి యా తులసీ శాపవశమ్మున తాము శిలవగుదువని నాకలనైనం దెల్యకుండితిని ఇక నాగతి యేమి మనోహర మనోహర.

నా-వ॥ లక్ష్మి ఐన కార్యంబులకు చింతించిన నేమి ఫలము ఇక ధైర్యంబు నొందుము.

లక్ష్మి-వ॥ నారద మల్లి నాకు నీతులు జెప్పవచ్చినవ చాలుచాలు ఇదియంత నీదియే నేరము లేకయున్న నానాథుండు తులసి సన్నిధికి బోవు నెట్లు నామె శాపంబిచ్చు నెట్లు ఇక మారుబల్కక యిచ్చోటినుండి వెల్లి పొమ్ము.

సం-వ॥ అంతలో బ్రహ్మ ఈశ్వరులు ప్రత్యక్షంబై లక్ష్మినిగని.

బ్రహ్మ-వ॥ లక్ష్మి శాంతింపుము శాంతించుము ఈ నారదుని యందేమి నేరంబుంలేదు అది యెటులన్నను. ఈ కలియుగ మానవ పాప పరిహారణమునకు భక్తుల రక్షణార్థనమునకై శ్రీహరి శిలరూపమొంద వలసియున్నది కావున నీవిప్పుడే గోలోకంబునకుంజని తులసిని వేడుకొన్న నీపతి శాపము కొంతదీర్చును నామాట నమ్మి పొమ్ము.

లక్ష్మి-వ॥ చిత్తము ఇదే నేబోవుచున్నదానను.

సం-వ॥ అని నిష్క్రమించి తులసి సన్నిధికేంజని.

వాదం - జుల్వ. (తరుజ - యేమని తెల్పుదునమ్మా)

లక్ష్మి॥ వందనము తులసీ సతి । వారిజనేత్రీ గుణమతి ॥వం॥ సుందరి నాపతి బిక్షము । యిందు బెట్టుమని వేడితి ॥వంద॥

వ॥ అమ్మా తులసి నీకిదో నమస్కరించెద కటాక్షించి నాపతి భిక్షము బెట్టుము ఇదో కొంగొడ్డియున్న దాన.

తుల॥ సుందరి శ్రీలక్ష్మి । ప్రతి । వందనమిదో గైకొనుమి ॥సుం॥ ఇందు
ముఖిరో నీవిభునీ । దుండగమేమని తెల్పుదు ॥సుం॥

వ॥ లక్ష్మి నీనాథుండు జేసిన దుష్కృత్యంబు లేమని తెల్పుదు తెల్పుటకు నానోరాడకున్నది.

లక్ష్మి॥ తల్లీ నావల్లభునీ । తప్పుల క్షమించుమనీ ॥త। పల్లవపాణిరో నిన్ను ।
ప్రార్థింపు చుంటి ప్రాసి ॥తల్లీ॥

వ॥ కావున నావిభుని తప్పుల క్షమించి శాపము మరల్పుమని వేడు చున్నదాన.

తుల॥ చల్లని అంబారిప్యాట । శౌరీ నన్నేలుగాని ॥చల్ల॥ పుల్లాబ్జాక్షిరో
యింతలో । పుండరీకునీ జేసెద ॥చల్ల॥

గీ॥ వినుము శ్రీలక్ష్మి ప్రతి సంవత్సరమున ♦ వచ్చు కార్తీక మాస
మున హరియు శిళలు ♦ గండకీ నధియందుండు గాననీవు ♦ సంది
యంబును బాయుము సుందరాంగి ॥

వ॥ కావున నీభర్త నాయొక్క శీలము జెడిపినందులకు నొక నిబంధన అది యెటులన్నను ఈ కలియుగంబున్నంతవరకు ప్రతి సంవత్సరమున వచ్చు కార్తీక శుద్ధ త్రియోదశి మొదలు పౌర్ణమి వరకు నీపతియొక్క ఛాయ ఈ గండకీనధి సాలగ్రామ శిలయందుండును ఇక నీపతి శాపము దీర్చితిని మీ నిజవాసంబునకుం జనుండు యేనిదే తులసీవృక్షమై జన్మించు చున్నదాన.

సం–వ॥ అంత తులసి దాత్రీ తులసి వృక్షమై జన్మించి హరి మెడలో పూలహారమైపడిన హరి శిలరూపంబొదిలి నిజరూపంబొంది లక్ష్మి సమేతుండై వైకుంఠంబున కేగిన పిదప కార్తీక శుద్ధత్రియోదశి సుదినంబున లక్ష్మి తులసిని పూజింపుచున్నంతలో సరస్వతి వచ్చి ఇట్టి వృక్షమును పూజింపుచున్న కారణమేమని లక్ష్మిని విచారించగా లక్ష్మి సరస్వతితో నిట్లనియె.

లక్ష్మి—వ॥ ఇందులకు నేడు కార్తీక శుద్ధత్రియోదశి వచ్చినందున ఇట్టి తులసిని పూజింపుచుంటిని కావున ఇట్లు తులసీ పూజలు సల్పువారు ఈ కథనువిని చదివి వ్రాసినవారలు ఇహమునందు సుఖమనుభవించి పరమునందు మోక్ష సామ్రాజ్యము పొందుదురు వింటివా సరస్వతీ.

సర—వ॥ అహాహా లక్ష్మి ఇట్టి తులసీ చరిత్రంబు విన్నంతలో నామనంబానందంబాయెనుగాని యిక నేవచ్చి చాల నాలస్యంబాయెను సెలదొసంగుము పోయివచ్చెద.

లక్ష్మి—వ॥ సరస్వతి మద్గృహంబునకు వచ్చి ఫలహారంబులు గుడువక నేపోయెదవ లోనికి రమ్మి. అన్నము భుజింతము.

సర—వ॥ సరి మంచిది పమ్మి.

సం—వ॥ అని లోనికేంజని సరస్వతి ఫలహారంబులు గుడచి సత్యలోకంబున కేగినంత లక్ష్మి తులసిని పూజించుట.

లక్ష్మి॥ తల్లీ తులసీ దయజూడవమ్మా । నాయుల్లములో నిన్ను దలచెద
నమ్మా । కొలచెద నమ్మా ॥తల్లీ॥

సం—వ॥ అని ఇట్లు లక్ష్మి తులసిని పూజింపుచున్నంజూచి సకల సురలు నరులు తులసి పూజలు జేయుచు సంతోషంబున నుండిరంత.

మంగళహారతి – దర్వు (తెరుజు – పిలువకురా నలు)

శ్రీరమణా । భవహరణా । వరదాయక వందిత చరణా । గరుడ గమన కంజలోచనా ॥శ్రీ॥ నారదలోలా । నతజనపాలా । నారాయణ మునీ నయగుణ శీలా । మారకోటి సుకుమార శరీర । మంగళములు గానుమిదో స్త్రీలోలా ॥శ్రీ॥ సురవర రతా । సురరిపుసీతా । కరిని గాచినా కమలాయతాక్షా । పారవార గంభీర మురారీ ॥ పరమపురుష పద్మనాభ । పాపభయవిభంగా ॥శ్రీ॥ వాలాయము అంబారిప్యాట నీ । వాసుదవని మదీ నమ్మితి పూసీ । చాలగ కవిరాజాఖ్యునికీ బహు । మేలొసంగియు పాలించుమి ధరలో ॥శ్రీ॥

గీ॥ శ్రీ వికారినామ సంవత్సరమున ♦ బాద్రపదశుద్ధ తృతీయ నూ
దినమునందు ♦ మేటి సతితులసి పరిణయ నాటకంబు ♦ రచన
జేసితి హారిదయా రసము వలనా ॥

కం॥ ఈ చరితంబెవ్వరు గా ♦ నీ చదివిన వినిన జెందు నిరుపమ విభవ ♦
శ్రీ చెలువు మీఱు సౌఖ్యము ♦ లాచంద్రార్కంబు యశము నభవ
పదంబున్ ॥

గద్య

ఇది శ్రీమద్భాగ్యనగరమునకు జెందిన కరీంనగర్ జిల్లా జన్మభూమికి
జెందినమెటుపల్లి తాలూకలోని అంబారిపేట గ్రామనివా
సులగు ఆపస్తంభసూత్రము కౌండిలబుషిగోత్రము పద్మశాలి
వంశోద్భవులగు శ్రీపుల్లి రాజయ్యగారి ధర్మపత్నిశ్రీమతి
యెల్లుమాంబగార్ల కనిష్ఠపుత్రుండగు రాజాఖ్య
నామధేయ ప్రణీతంబైన సతితులసీ పరిణయ
నాటకము నందలి పంచమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ



కొండా వీరయ్య అండ్ సన్స్ వారి శ్రీ భారతీ ముద్రాక్షరశాల,
1712 మహాకాళి గుడివెనుక, సికింద్రాబాద్-ఆం.ప్ర.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు | తప్పిన అక్షరములు |
|---|---|---|---|---|
| 4 | 19 | వదానా | వరదానా | ర |
| 6 | 29 | కొల్లూరి | కొల్గూరి | |
| 11 | 1 | అమరావతి | అమరావళి | ళి |
| | 4 | ,, | ,, | ,, |
| | 9 | ,, | ,, | ,, |
| 13 | 1 | నన్నడు గుమే | నన్నడు గుటమే | ట |
| | 22 | అమరావతి | అమరావళి | ళి |
| 15 | 16 | ,, | ,, | ,, |
| | 23 | ధంభాశూని | ధంభా శూరుని | రు |
| 27 | 4 | కల్లలనాడు గురు | కల్లలనాడు వాడుగురు | వాడు |
| | 6 | ధ్వజా లిచ్చియు | ధ్వజా భిల్చి | భిల్చి |
| 29 | 19 | కారణాకర్త అష్ట | కారణాకర్త లిష్టి | లిష్టి |
| | 28 | ముగ్గురితో | ముగ్గురిలో | లో |
| 30 | 6 | బహూ | ఓహో | ఓహో |
| | 7 | పశ్న | ప్రశ్న | ్ర |
| | 13 | బాదుగ | బాగుగ | గు |
| | 16 | ధరించియుండి | ధరించి యుండిరి | రి |
| | 21 | సంపారించు | సంపాదించు | ది |
| 32 | 8 | బొగిడదే | బొగిడరే | రే |
| 36 | 28 | ఏమ్మెకీ | ఏమ్మెకీ నా మెకీ | నా మెకీ |
| 58 | 16 | క్రీడింతము రమ్మికను | క్రీడింతము రమ్మికనునఖీయిక | నఖీయిక |
| 64 | 7 | పావనుండ ॥దే॥ | నావనుండ భావనుండ ॥దే॥ | భావనుండ |
| | 10 | నాట్యము | నాట్యము నాడింతు | నాడింతు |
| | 11 | పార గంభీరుడ | పార వారగంభీరుడ | వార |
| 69 | 11 | మంకుబాపు | మంకుబాపు సుంకుబాపు | సుంకుబాపు |
| 76 | 3 | భయవిహిత | భయవిరహిత | ర |
| 80 | 10 | జాతులాము | జ్ఞాతులాము | ఞ |
| 87 | 23 | దలపోయు | దలపోయు వలపోయు | వలపోయు |
| 92 | 9 | ఇంతాయేమని | ఇంకాయేమని | కా |
| 49 | 16 | ఇండి | ఇంతీ | తీ |
| 3 | 11 | భారతి నిలు | భారతి నిను | ను |

ఇప్పుడే వెలువబడిన ప్రప్రథమ వ్రాతప్రతి నూతన ప్రచురణ

మహాఅధర్వణ వేదసారము

# శ్రీ సిద్ధ నాగార్జున తంత్రమ్

అను మహా కక్ష్యపుట తంత్ర గ్రంథమ్.

## రచయిత: శ్రీ గుండు వేంకటేశ్వర్‌రావ్‌గారు

కడు సులభ శైలిన సర్వమంత్ర, యంత్ర, తంత్ర, మణి ఓషధులను, వనమూలిక విషయమునకు, వివిధముగా నుపయోగించుటను, సంజీవి, పాతాళ నిధులు, అంజనములు, హిప్నాటిజం, క్రిస్టల్ గేజింగ్ ఇత్యాది అపూర్వ విషయములతో షుమారు 1000 పైగా విషయములుగల గ్రంథము మంత్ర వైద్య శాస్త్రమర్మములను బహు చక్కగా వివరింపగల క్రొత్త గ్రంథము.

అడ్వాన్సు లేనిదే పంపబడదు    వెల రూ. 5. 00.

వలయువారు:—

**కొండా వీరయ్యా అండ్ సన్స్,**

పోష్టుబాక్సు నెం. 104

ఫోన్ నెం. 6641    సుభాశాలివీధి, సికింద్రాబాద్.